# పరివర్తనం

[నవల]



గోపీచంద్



దేశికవితామండలి
విజయవాడ-2

దేశీ ప్రచురణ—
ద్వితీయ ముద్రణ
అక్టోబరు 1951
హక్కులు రచయితవి
భారత ముద్రణాలయం.
—విజయవాడ.
వెల : రూపాయి.



సంపాదకులు:
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ



## గోపీచంద్

గోపీచంద్ విప్లవకవి 'కవిరాజు' కీ. శే. త్రిపురనేని రామస్వామి చౌదరి గారి జ్యేష్ఠపుత్రులు. భావాల్లో, ఆదర్శాల్లో తండ్రికి మించిన చేయి.

'లా' డిగ్రీ తీసుకున్నారు. గాని న్యాయవాదవృత్తి రుచించలేదు. ఇంగ్లీషు, తెలుగు సారస్వతాల్లో బాగా కృషిచేసి లోతుపాతులు తెలుసుకున్నారు. మార్క్సిజాన్ని శాస్త్రీయ దృక్పథంతో చదివి అర్థంచేసుకున్నారు.

రాజకీయంగా రాయిస్టు, కొంతకాలం ఆంధ్రా రాడికల్ డెమొక్రటిక్ పార్టీ కార్యదర్శికూడాను. భావవిప్లవం వచ్చిన నాకుగాని దేశానికి ముక్తిలేదని వీరివాదన. కళ కళకోసమే అనే వాదాన్ని వొప్పుకోరు. సంఘశ్రేయస్సు లేని కళ కళ కాదనే వీరి వుద్దేశం.

తండ్రిగారి సంస్కారంవల్ల చతుర సంభాషణా, నిష్కర్షమైన విమర్శా, ఇంగ్లీషు సారస్వత సంపర్కంతో వైజ్ఞానికదృష్టీ, కళాపుష్టీ ఏర్పడినాయి. అందుకనే వీరి

ప్రతిరచనా హృదయానికి సూటిగా తగులుతుంది, మనసులకు ఆలోచన రేకెత్తిస్తుంది, సునిశిత హాస్యం వీరి విశిష్టత. తెలుగునాటి పల్లెజీవితాన్ని వున్నది వున్నట్టు 'ఉన్నవ'వారి తర్వాత చక్కగా చిత్రించగలిగింది గోపీచంద్ గారొక్కరే.

గోపీచంద్ గారికి సాహిత్యంలో అన్ని రంగాలలోనూ ప్రతిభవున్నది. కథకుడుగా, నాటకకర్తగా, వ్యాసకర్తగా, రేడియో ఉపన్యాసకుడుగా ఆంధ్రదేశంలో ప్రసిద్ధిజెందారు. ఆధునిక తెలుగుసాహిత్యంలో భాషా, భావ విప్లవాలకు ప్రాతిపదిక వేసినవారిలో వీరే ప్రథములనవచ్చు.

'రైతుబిడ్డ'కు 'గృహప్రవేశా'నికి భావగర్భితమైన సంభాషణలు వ్రాసి మంచి సినిమాఅనుభవం గడించిన వీరు, ప్రస్తుతం సినిమా రచయితగా, డైరెక్టరుగా ప్రసిద్ధి జెంది ఆంధ్రదేశానికి 'లక్ష్మమ్మ'లాంటి ఉత్తమచిత్రాలను అందిస్తున్నారు.

## వీరి రచనలు

| | |
|---|---|
| భార్యల్లోనే వుంది | (కథలు) |
| దేశం ఏమయ్యేట్టు? | ,, |
| గీతా పారాయణం | ,, |
| తండ్రులూ - కొడుకులూ | ,, |
| సరే, కానివ్వండి | ,, |
| దేవుని జీవితం | ,, |
| సినిమా భూతం | ,, |
| పరివర్తనం | (నవల) |
| అసమర్థుని జీవయాత్ర | ,, |
| నా కొత్తనవల | ,, |
| ఉభయ కుశలోపరి | (జాబులు) |
| పోస్టుచెయ్యని ఉత్తరాలు | ,, |
| పట్టాభిగారి సోషలిజం | (విమర్శ) |
| మార్క్సిజం అంటే ఏమిటి? | ,, |
| సోషలిష్టు వుద్యమ చరిత్ర | ,, |
| ప్రజా సాహిత్యం | ,, |

D



## ‘విరహం’

భావకవులు ప్రధానంగా ప్రచారంచేసిన సంస్కారం విరహం.

అంటే పూర్వసాహిత్యంలో విరహవేదనపడే అభ్యాసం లేదనీకాదు, వీరునూతనంగా కనిపెట్టారనీకాదు నా అభిప్రాయం. దాన్ని విడదీసి, దానికి ఒంటిస్తంభంమేడ కట్టించి, నలుగురికీ కనపడేటట్టుచేసి, మోజుపుట్టించింది మాత్రం భావకవులు.

ఒక స్త్రీని చూట్టం, విరహవేదనపట్టం వీరుప్రచారంచేసిన సంస్కారం. దీనివల్ల నిజమైన ప్రేమ ఎల్లకాలం ఒకస్త్రీని అంటిబెట్టుకొని ఉంటుందనీ అమె లభ్యంకాకపోతే ఆమెను ఊహించుకుంటూ కృశించటం మెరుగనీ– అనే భావాలు ప్రచారంలోకి వచ్చినై. ప్రచారంలోకి రావటమేకాదు, నిత్య జీవితంలోకి ఎక్కినై.

అనుభవం దీనికి వ్యతిరేకంగావుంటే అది శుచ్చకామం.– ప్రేమకాదు.

విరహవేదనపట్టమే జీవితాశయంగా పెట్టుకున్నవాళ్లని మనం ఎరుగుదుం, వీళ్ళని చూస్తుంటే విరహవేదనపట్టానికే వీరు ప్రేమిస్తారా అనిపిస్తుంది. అసలు ప్రేమించటంకంటే విరహవేదనలోనే వీళ్ళకు ఎక్కువ సుఖం ఉన్నట్టు కనిపిస్తుంది.

ఒకస్త్రీని ప్రేమించి, ఆమె లభ్యంకాకపోతేనో, చెయ్యిజారిపోతేనో, ఆమె నామం జపిస్తూ జీవితం వెళ్ళబోసుకోవటం మనలో చాలా గొప్పవిషయంగా పరిగణింపబడుతూవుంది. ‘గడ్డంగీకోడు’ ‘అన్నం ముట్టడు’ అని ఘనతగా చెప్పుకుంటాం. సరే, ఇక ఆత్మహత్య చేసుకుంటే ఆగొప్పతనం కవులు కీర్తించవలసిందే. ఏ పోతురాజుగానో, ఏపేరంటాలుగానో తక్షణం వెలవవలసిందే.

ఈ దృష్టికీ. సహగమనానికీ, భర్తలుపోయిన స్త్రీలను వితంతువు లుగా ఉంచటానికీ తేడా ఏముంది? రెండూ ఒక్కటే! అక్కడ స్త్రీసహగమనంచేస్తూవుంది, ఇక్కడ పురుషుడు చేస్తున్నాడు. అక్కడ స్త్రీవైధవ్యం అనుభవిస్తూవుంది, ఇక్కడ పురుషుడు అనుభవిస్తున్నాడు-ఇంతేతేడా. మనం సహగమనం మానిపించాం. వితంతూవివాహాలు చేస్తున్నాం. కాని పురుషులవిషయం మాత్రం ఈసంస్కారాన్నే పొగుడుతున్నాం.కారణం యేమిటి?

ఆసంస్కారం వేసిన వెర్రితలలను తీసివేసినా ఆ సంస్కారాన్ని రూపుమాపలేకపోయాం అన్నమాట. బాహ్యలక్షణాలను కనపడకుండా చేసినా ఆ లక్షణాలకుమూలం అయిన సంస్కారంమాత్రం మనలో ఉంటూనేవుంది. బుద్ధిమారలేదు. భర్తపోయినా స్త్రీ మరొకవివాహం చేసుకోకుండా, మనస్సుని ఆ పోయిన భర్తమీద కేంద్రీకరించి ఉన్నంతకాలం సహగమనం చెయ్యకపోయినా మనస్సిద్ధాంతానికి వచ్చినలోటు ఏమీలేదు అనుకున్నాం - వితంతువులుగా వుండటానికి అంగీకరించాం. పురుషుడుగాని, స్త్రీగాని మళ్ళీవివాహం చేసుకుంటానికి అంగీకరించినా, పూర్వసంస్కారమే గొప్పదని ఇప్పటికీ పొగడుతున్నాం.

అందుకనే విడాకులు ఇప్పటికీ మనం అంగీకరించటంలేదు. స్త్రీ వితంతువు అయితేతప్ప మళ్ళీ పెళ్ళికి అనుజ్ఞఇవ్వటంలేదు.

సెక్సువాంఛ ప్రకృతి ప్రేరేపణ. దాన్నిమనం తీసివెయ్యలేం. మానవునికి సహజంగాఉండే వాంఛలను తీర్చుకోవలసిందేగాని, అణగదొక్కితే ఎన్నివెర్రితలలు వేస్తుందో ఎవ్వరుచెప్పగలరు? ఏచెడుమార్గాన బయటపడుతుందో ఎవ్వరు చెప్పగలరు?

నేటి ప్రేమకవిత్వం ప్రచారం చేసే సంస్కారం దీనికి విరుద్ధం."హృదయం ఇచ్చివేశాను. ఇక అదితిరిగిరాదు. నాబ్రతుకు ఒకపెద్ద నిట్టూర్పుగా వేగవలసిందే,"అని. ఈదృష్టి ముదిరితే బ్రహ్మచర్యం అవుతుంది - మానసికంగా కాకపోయినా శారీరకంగా. బ్రహ్మచర్యం ప్రకృతినియమాలకు విరుద్ధం. ప్రకృతి నియమాలను ఉల్లంఘించటం మానవుడు చెయ్యగలిగినపనికాదు. అందుకు ప్రయత్నించటంకంటే అవినీతి ఇంకొకటిలేదు. విరహం ఒకసిద్ధాంతంగా తయారై ఏపరిస్థితుల్లోనూ బ్రహ్మచర్యాన్ని పురికొల్పేదిగా ఉండగూడదు.

## 'వే దాం త ం'

వేదాంతానికీ విరహానికీ దగ్గరసంబంధం వుందంటే విచిత్రంగా వుండొచ్చు. ఎక్కడివేదాంతం? ఎక్కడి విరహం? అనిపిస్తుంది. ఒకటి ఆధ్యాత్మికం, ఒకటి భౌతికంగదా. ఈరెంటికీ చుట్టరికం యేమిటి? అని ఆశ్చర్యం కలుగుతుంది. కాని ఈ రెండూ మానవుణ్ణి ప్రపంచంలోనుంచి- కష్టాలను ఎదుర్కోనివ్వకా, సుఖాలను అనుభవించనివ్వకా - బయటకు తరిమేవే. బాహ్యప్రపంచాన్నికాక, లోపలకుచూచుకోమని ప్రేరేపించేవే. ప్రపంచ సమస్యల్లో తగులుకోకుండా తప్పించుకుతిరిగేవాడే ధన్యుడని ఈ సిద్ధాంతాల పర్యవసానం - ఒకరికి భగవంతుడువంకా, మరొకరికి ప్రేయసివంకా.

ఈ సంస్కారం సంఘానికి చాలానష్టం అని నేను వేరే చెప్పనక్కర లేదు. సాంఘికసమస్యలవైపు దృష్టిని పోనివ్వదు. అవి చాలా స్వల్పవిషయాలకుమల్లే, నీచమానవుల కొట్లాటలకుమల్లే కనిపిస్తాయి. లౌకిక వ్యవహారాలకూ, నిత్యజీవితంలోని ముఖ్యావసరాలకూ అతీతంగా కనపట్టం మనక చాలా గొప్పగా వుంటూవుంది. "నాకురాజకీయాలుతెలియవు" అనిగర్వం। ముసి ముసి నవ్వు నవ్వుతాడు రచయిత.

"రాజకీయాల్లో అభిప్రాయభేదాలుంటే ఉండొచ్చుగాని, సారస్వతంలో యేమిటండీ? చక్కగామనం అందరంకలసి పనిచెయ్యకా?" అంటాడు. యిది నాకుబొత్తిగా అర్థంకాని విషయాల్లో ఒకటి. రాజకీయం చేసుకున్న 'పాపం' యేమిటో, సారస్వతం చేసుకున్న 'పుణ్యం' యేమిటో నాకు ఎంతఆలోచించినా తెలియటంలేదు. రాజకీయవేత్తలు కలహవేత్తలు అవవలసిన ఆవసరం సాహిత్యపరులు వీటికి అతీతులు కావలసిన అవసరం యేమిటి? అసలు వీరిద్దరికీ భేదం యెక్కడొచ్చింది?" యెందుకొచ్చింది?

మొత్తం అందరూ సంఘంలోవుండి జీవిస్తున్నవాళ్ళే. అందరూ సాంఘికపరిస్థితులవల్ల ఇన్ఫ్లుయన్స్ కాబడుతున్నవాళ్ళే! ముక్కుమూసుకొని యే అరణ్యాల్లోనో, యే కోటగోడలమధ్యో కూర్చున్నంతమాత్రాన సంఘం ప్రభావం మనమీద పడకుండా ఉండదు- దాన్నుంచి మనం తప్పించుకోలేం. అసలు తప్పించుకోవాలనే ఈ కోర్కె, ముక్కుమూసుకొని కూచోవాలనే ఈ గుణం, సాంఘిక పరిస్థితులవల్ల యేర్పడ్డదే అని తెలుసుకున్నప్పుడు

ఈ అతీతంగా వుండాలనే మోజు ఎంతచెడ్డదో మనకు తేలిగ్గా బోధపడుతుంది ముక్కుమూసుకొని మహారణ్యంలో కూర్చునే మౌనికీ, సంఘానికి అతీతంగా అధిష్ఠించాలనే రచయితకీ భేదంయేమీలేదు. ఇద్దరూ ఒకే సంస్కారంతో తాళింపు వెయ్యబడి ఈ రూపాలు ధరించారు, కాని తాళింపు మాడింది.

కవుల్లోనూ రాజకీయవేత్తల్లోనూ సంఘానికి అపకారం చేసేవాళ్ళూ ఉపకారం చేసేవాళ్ళూ ఉంటారు. ఈ రెండుతెగలకూ యెప్పుడూ పడదు. యే తెగకి ఆతెగ రెండోతెగని జయించాలని ప్రయత్నిస్తుంది. తమ భావాలు ప్రజల్లో యెక్కువ ప్రచారం కావాలనీ, ప్రజలను తమవైపుకి అకర్షించు కోవాలనీ తాపత్రయ పడుతుంటారు. ఒకరినొకరు విమర్శించుకుంటారు,ఇందులో రాజకీయవేత్త ప్రత్యేకత యేమీలేదు. సంఘానికి అతీతంగా ఉండాలనుకునే కవి వేదాంతియొక్క భగవంతునిస్థానం అక్రమించుకోటానికి ఉబలాటపడుతు న్నాడు. వేదాంతియొక్క చేతనసత్తాకిమల్లే, పరబ్రహ్మానికిమల్లే,జ్ఞానతేజానికిమల్లే ప్రపంచానికి విడిగావుండి ప్రపంచాన్ని నడపాలని ఈకవిబ్రహ్మ కోర్కె.

ఈ దృష్టే కవిచేత, "నాకురాజకీయాలు తెలియవు," అని సగర్వంగా పలికిస్తోంది. తానుసర్వకాల సర్వావస్తలకూ పనికివచ్చేభావాలు వెలిబుచ్చేవాడి ననీ రాజకీయవేత్త తాత్కాలిక సమస్యలకోసం పోరాడేవాడనీ అతనిఊహ. తాను సిద్ధాంతం నిర్వచనం చేసేవాడు; రాజకీయవేత్త ఆచరణలో పెట్టేవాడు.

సిద్ధాంతం ఆచరణా ఒకదానిమీదఒకటి ఆధారపడివుంటుంది. సిద్ధాంతం లేని ఆచరణ ముందుకు సాగదు. ఆచరణవల్లే సిద్ధాంతం పుడుతుంది. ఈరెంటికి అవినాభావసంబంధం ఉంటుంది. ఒకదానికొకటి సహాయపడుతూ వృద్ధిచెందు తయి. ఆచరణకంటే సిద్ధాంతం గొప్పదని చెప్పటంగాని, సిద్ధాంతంకంటే ఆచరణ గొప్పదని చెప్పటంగాని, రెండూతప్పే. సంఘంలో ధనికులూ బీదవాళ్ళూ ఏర్పడ్డ తర్వాత పనిచెయ్యటం బీదవాళ్ళవంతూ, సిద్ధాంతం చెప్ప టం ధనికులవంతూ అయింది. దీనివల్ల పనిచేసేవాళ్ళు సిద్ధాంతం సృష్టించు కోలేకా, సిద్ధాంతసృష్టి ఆచరణవల్ల జరక్క సంఘం కుళ్ళిపోయింది.

సంఘం సర్వాంగ శోభితం కావాలంటే ఈ విభజన ఉండగూడదు. కవి వేదాంతిరూపాన్ని వొదలాలి. ప్రపంచాన్ని నడిపే విశుద్ధచేతనాన్ని అనుకో గూడదు?

# 'ప్రేమ'

నవ్యులు భావకవులను విమర్శిస్తున్నారంటే, వాళ్ళుప్రచారంచేస్తున్న సంస్కారం దేశారిష్టం అనే ఉద్దేశంతో చేస్తున్నారు. అంతేగాని కురుగంటి సీతారామయ్యగారు అనుకుంటున్నట్లు ప్రేమించటంతప్పనీకాదు, ప్రేమించటం చేతగాకాకాదు, యేదో లోటుఉండీకాదు. ఏమైనా లోటువుంటే అమలిన శృంగారం ప్రచారంచేసే వాళ్ళల్లో, దాన్ని పొగిడేవాళ్ళల్లో, రెండోది మలిన శృంగారం అని చెప్పేవాళ్ళల్లో వుండాలిగాని నవ్యుల్లోకాదు.

భావకవిత్వాన్ని విమర్శించేనవ్యులు మానవునికి సహజంగా ఉండేగుణాల్లో సెక్సు ఒకటని అంగీకరిస్తారు. కాని యిదే బలవత్తరమైన గుణంఅనిగాని ఇంతకంటే మానవునికి వేరొక గుణంలేదనిగానీ అంగీకరించరు. అందుకనే అన్నీ సెక్సుని నిరసిస్తున్నారనిగానీ, ప్రేమకు తగిన ప్రాధాన్యత యివ్వటం లేదనిగానీ అనుకోటం తప్పు. సెక్సుని జయించమని-అంటే అణచుకోమని నవ్యులు చెప్పరు. అది, ప్రేమించినస్త్రీ లభ్యంకాకపోతే విరహవేదనపడటం గొప్పని చెప్పేవాళ్ళు, చెప్పగలిగినమాట. సెక్సు లేకపోతే జనాభా పెరుగుదలే లేదు. జనాభావృద్ధిచెందక క్రమేపీ నశిస్తే ఆకలిసమస్యేలేదు. ఈవిషయం నవ్యులకు బాగా తెలుసు.

అందుకనే నవ్యుల్లోప్రముఖరచయిత లెవ్వరూ తమరచనల్లో సెక్సుని బహిష్కరించలేదు. ఛెకోవ్, గార్కీ మొదలయినవాళ్లంతా తమ రచనల్లో సెక్సుకి ప్రాధాన్యత యిచ్చారు. గార్కీ షోలకోవ్‌లు రాసిన'బూతుల' కంటే పెద్ద'బూతులు' యెవ్వరురాయగలరు? అంతేకాదు, ఇటీవల వొస్తున్న యుద్ధవాఙ్మయంలోకూడా వాఙ్మయాన్నంతా యుద్ధంగెలుపుకి సహాయపడేదిగా సృష్టిస్తున్నా, రష్యన్ రచయితలు సెక్సుని మరపనట్టుగా స్పష్టంగా కనిపిస్తుంది.

సెక్సు మానవుని ముఖ్యమైన అవసరాల్లో ఒకటి అవటంవల్ల దాని విషయంలోకూడా సక్రమమైన దృష్టిని ప్రచారం చెయ్యవలసిన బాధ్యత రచయితలమీదఉంది. సక్రమమైనదృష్టి ప్రచారంచేస్తే మంచీ లేకపోతే చెడూగాని, దానిజోలికి వెళ్లకపోటం మంచీ, వెళ్ళటం చెడూకాదు.

నేను ఈమధ్య సెక్సుమీద కధలురాస్తే ఒకమిత్రుడు వాటిని చదివి, "అయ్యయ్యో మీరుకూడా ఇటువంటి కధలురాశారే!" అని ముక్కుమీద వేలు వేసుకున్నాడు.

ఆకధలురాయటంలో యేదైనా విచిత్రం చేశాననిగానీ, చెయ్యగూడని పనిచేశాననిగానీ నేను అనుకోలేదు. ఇతర విషయాల్లో నాకు తెలిసినభావాలు, నేను మంచివిఅనుకున్న భావాలు, చదువరులకు చెప్పటానికి ప్రయత్నించినట్టే సెక్సు విషయం ఈ కధలో చెప్పటానికి ప్రయత్నించాను. అత డిలా అనే టప్పటికి, రచయితగా అతడు అంతకుముందు నామీద చూపిస్తున్న గౌరవం నేను 'బూతు' కధలురాయకపోవడంవల్ల కలిగిందేమోఅని అనుమానంవేసింది. అలా అయ్యేటట్టయితే ఆగౌరవాన్ని పోగొట్టవలసిన అవసరం ఎంతైనావుంది.

అందుకని వెంటనే, "యేం, నేను 'బూతు' కధలు ఎందుకురాయ కూడదు? నేనుచేసుకున్నపాపం యేమిటి.? అందులో తప్పేమివుంది?" అని అడిగాను.

అతడు ఎంతసేపూ, "అయ్యయ్యో" అంటాడుగాని కారణంచెప్పడు. ముక్కుమీద వేలువేసుకోవటం మాత్రం మానడు.

నేను సెక్సుజోలికి వెళ్ళని రచయితనని అంతకుముందు అతను నన్ను గౌరవిస్తూ ఉండివుంటాడు. ఈకధలు ఆ ఉద్దేశాన్ని తారుమారు చేసివుంటాయి. నన్నుగురించి తాను ఊహించుకున్న బొమ్మచెదిరి బాధపడుతున్నాడు.

సెక్సువిషయంలో మానవులకూ పశువులకూ భేదంవుంది.

పశువులు సెక్సుని నిత్యకృత్యాల్లో ఒకటిగా తీర్చుకుంటాయి. అంద చందాలతోపనిలేదు ఆకర్షణతో పనిలేదు. అవసరంతీరటమే కావలసింది.

మానవుడు అల్లాకాదు. దానికొక ఆకర్షణ ఏర్పరచుకున్నాడు. కొన్ని అందచందాలు కూర్చుకున్నాడు. పిల్లల్నికనటమేకాక ఆహ్లాదాన్నిచ్చే రక రకాల అనుభూతాల్ని సృష్టించుకున్నాడు. దీన్నే ప్రేమ అంటున్నాం.

ప్రేమను ఏనవ్యుడూ నిరసించడు. నిరసించి మానవుడు మృగదశకు పొమ్మని చెప్పడు. అందచందాలు మిధ్యఅనిచెప్పి, అవసరం తీర్చుకోవటమే పరమావధిఅనిచెప్పడు.

నవ్యులు నిరసించేది 'ప్రేమకంటే ఎక్కువేమీలేదనే' భావాన్ని. తాను ప్రేమించిన వ్యక్తి లభ్యం కానప్పుడు కృశించటమే పరమ ధర్మం అని చెప్పే సంస్కారాన్ని, కృత్రిమ బ్రహ్మచర్యాన్ని ప్రోత్సహించే సిద్ధాంతాన్ని.

ప్రేమను నిరసించేవాళ్ళు మనలో లేకపోలేదు. వాళ్ళు నవ్యులుకాదు—పూర్వ సంస్కారానికి చెందినవాళ్లు. 'సంభోగం సంతానంకోసం' అని చెప్పేవాళ్ళు భావకవులకన్నా వెనకటివాళ్ళు, వీళ్ళు ప్రేమను అంగీకరించరు. 'పెళ్ళిసంతానంకోసం సంతానం మోక్షసాధనం' అంటారు. సంతానం కావాలనే వాంఛతో కాకపోతే, సంభోగమే జరగ్గూడదనీ, అలా జరపటం పాపహేతువనీ చెపుతారు. సంతాననిరోధం మొదలయినవి తప్పని ఈదృష్టితోనే వీళ్ళు ప్రచారం చేస్తుంటారు. ఈ పెళ్ళిళ్ళకు భార్యాభర్తల ఇష్టా ఇష్టంతో ప్రసక్తిలేదు. పెద్దవాళ్ళయి ప్రేమా గీమా, ఇష్టం అయిష్టం అని ఇబ్బందిపెట్టకుండా చిన్నప్పుడే పెళ్లిళ్ల చేసివెయ్యటం వీళ్ళకువీలు. తమఇష్టాయిష్టాలతో నిమిత్తంలేకుండానే భార్యాభర్తలు అవుతారు; పిల్లల్ని కంటారు; మోక్షానికివెళ్తారు. దీనికిప్రేమఎందుకు?

కానిమనం చరిత్రని తిరగవేసి చూచుకునేటట్టయితే వీళ్ళసిద్ధాంతం సహేతుకమైంది కాదనిరుజువుఅవుతుంది. కామేచ్ఛప్రపంచ పరిణామంలో ఒకదశలో కలిగిందిగాని అనాదినుంచీ ఉందికాదు—సంతానంకోసం ఏర్పడ్డదీకాదు.

స్త్రీపురుషసంపర్కం లేకుండానే పిల్లలు కలగటం మానవచరిత్రలో ఒకదశలో జరిగిందని మనం ఎరుగుదుం. దీన్ని బలపరిచే నిదర్శనాలు మనపూర్వవాఙ్మయంలో అనేకం కనిపిస్తయి. కుండల్లో పుట్టినవాళ్ళూ, చెవుల్లోనుంచి వొచ్చినవాళ్ళూ, స్వేదబిందువువల్ల కలిగినవాళ్లూ- రకరకాలు వున్నారు. ప్రపంచ పరిణామంలో సెక్సు సంబంధం లేకుండా సెక్స్ విభజనవల్ల ఉత్పత్తి జరిగిన రోజులుకూడా ఉన్నాయని శాస్త్రజ్ఞులు చెపుతున్నారు. సెక్సువాంఛ తరువాత ఏర్పడిందని వీళ్ళు చెపుతున్నారు.

స్త్రీ పురుష సంపర్కం పిల్లలకోసమే అని భగవంతుడు నిర్ణయించిపెట్టినట్లయితే, పైవిధంగా ఉత్పత్తి జరగటాన్ని వీళ్ళేవిధంగా సమర్థించగలరు? ఉత్పత్తికి సెక్సు ఆధారంగా మొదటినుంచీ ఎందుకులేదు? స్త్రీ పురుష సంపర్కం అవసరం లేకుండా ఉత్పత్తి ఎలా జరిగింది? పూర్వచరిత్ర ఇలా వుండగా

ఇప్పుడు మళ్ళీ శాస్త్రజ్ఞులు సెక్సుసంబంధం లేకుండా పిల్లలను తయారుచేసే వీలుందని అభిప్రాయ పడుతున్నారు. పరిశోధనలు జరుగుతున్నవి. ఫలించే అవకాశాలు కూడా కనిపిస్తున్నయి.

సెక్సుకి సంబంధం లేకుండా ఉత్పత్తి జరగటానికి వీలు ఏర్పడినా కామేచ్ఛ మానవుల్లో ఉంటూనే ఉంటుంది. ఎందుకుండదు? కామేచ్ఛ సంతానం కోసం ఏర్పడ్డదికానప్పుడు ఇది విడిపోయినా అదివుండేదే! స్త్రీ పురుషుల మధ్య వున్న ఆకర్షణ వృద్ధి చెందేదే! అప్పుడు దానికి సంబంధించి వున్న గర్భ స్రావాలూ, ప్రసవ వేదనలూ ఉండకుండా అద్భుతమైన ఆకర్షణగా ఉంటుంది, సంతానంకోసం సెక్సు ఏర్పడిందనే సనాతనులు దీనికేం చెపుతారు? సంభోగ వాంఛ సంతానంకోసం కాక, యితర సుఖాలకోసం తీర్చుకోవటం పాపహేతువు అని చెప్పేవాళ్ళు తమ వాదం సక్రమమైందని ఏవిధంగా నిరూపిస్తారు? శాస్త్ర జ్ఞుల పరిశోధనలను ఎగతాళి పట్టించి, అవి పూర్తి అయింతర్వాత 'మావాళ్ళు ఎప్పుడో ఈ విషయం కనిపెట్టారు' అని పురాణాల్లోనుంచి నిదర్శనాలు చూపించి మురుసుకుంటారు. మనల్ని మురుసుకోమంటారు.

దీన్నిబట్టి ప్రేమను నిరసించేది కామేచ్ఛ సంతాన ఉత్పత్తికోసం భగ వంతుడు కలిగించాడని చెప్పేది సనాతనులుగాని నవ్యులుకాదు అని తేలుతుంది. పెళ్ళి ఆనుష్మిక సాధనం అని చెప్పే సనాతనులు సెక్సువాంఛకు నీచార్థం కలి గించారు. కురుగంటి సీతారామయ్యగారు ఒకపక్క సనాతనుల ఈ దృష్టిని సమర్థిస్తూ, మరొకపక్క ప్రేమను నిరశించేవాళ్ళను, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి సహాయంతో, హేళనచేస్తున్నారు. పైగా ఈ దృష్టి నవ్యులకు అంట కడుతున్నారు.

పెళ్ళి ఆముష్మికానికి సాధనంఅని చెప్పటానికి ప్రేమను నిరసించటానికీ భేదం ఏమిటి? కామేచ్ఛను సంతానం కోరే తీర్చుకోవాలంటే ప్రేమకు చోటు ఎక్కడ? అందచందాలతో నిమిత్తం ఏమిటి? ఏ స్త్రీ అయితే ఏమి? ఏ పురు షుడు అయితే ఏమి? కుటుంబం మంచి చెడ్డలు తెలుసుకోవాలంటే వాళ్ళ ఉత్పత్తి శక్తిని తూకం చూసుకుంటే చాలు. మిగతా విషయాలు అనవసరం.

సీతారామయ్యగారి ఈ విచిత్ర ప్రకృతి అర్థం అయ్యేదికాదు.

## 'రచయిత'

ప్రకృతి చేష్టలకు ఆదర్శం ఉండదు. ఒక ప్రయోజనాన్ని సాధించటానికి ఆపనులు జరగటంలేదు. వాటిని వినియోగించుకొని అభివృద్ధి చెందవలసిన బాధ్యత మానవునిది.

/సూర్యుని వేడినీ, చంద్రుని చల్లదనాన్ని మానవుడు తన సుఖానికి ఉపయోగించుకుంటున్నాడు గాని, అవి ఒకప్రయోజనాన్ని సాధించాలనే తలంపుతో ఆపనులు చెయ్యటంలేదు. అందువల్లే చంద్రుని వెన్నెల ఒకరికిహాయిగా నిద్రపోటానికీ, మరొకరికి మత్తుగా ప్రేమించుకోటానికీ, ఇంకొకరికి దొంగతనం చెయ్యటానికీ, వేరొకరికి ప్రయాణం చెయ్యటానికీ ఉపయోగపడుతూవుంది.

ప్రకృతినియమాలను మానవుడు మార్చలేనిమాట నిజమే। సూర్యుణ్ణి పడమట ఉదయించేటట్టు చెయ్యలేం; చంద్రుని వెన్నెలకు వేడినికలిగించలేం. కాని వాటి స్వభావాన్ని అర్థంచేసుకొని, మనలాభానికి ఉపయోగించుకోగలం./

సంఘంలో జరిగే సంఘటనలకూ రచయితకూ ఉన్నసంబంధం కూడా కొంతవరకు ఇటువంటిదే. దేనికి దాన్నివిడదీసి చూస్తే సంఘంలో జరిగే సంఘటనలకు ప్రయోజనంకనపడదు. ప్రయోజనంకలిపించి, చదువరులకు ఒకదృష్టిని కలిగించవలసిన బాధ్యత రచయితమీదఉంటుంది. "వస్తువుఏదైనా రచనావిశేషమే కావ్యం"అన్నారు అనంతకృష్ణశర్మగారు. నేనుదీనికికొంతకలిపి, "వస్తువుఏదైనా రచయితచదువరులకు కలిగించదలచిన దృష్టీ,దాన్ని సాధించగలిగిన రచనావిశేషమూ ఉత్తమకావ్యలక్షణాలు" అంటాను.

రచయిత చదువరులకు కలిగించదలచిన దృష్టికావ్యానికి ముఖ్యలక్షణం. ఇలాచెప్పకోకపోయినట్లయితే సంఘానికి అపకారంచేసే రచయితలుకూడా ఉత్తమరచయితలుగా పరిగణింపబడతారు. సంఘానికి అపకారంచేసేరచనలు-రచనా విశేషం ఎంతగొప్పదైనా-ఉత్తమ రచనలు అవుతాయని ఎవరు అనగలరు?

అనంతకృష్ణశర్మగారి నిర్వచనానికీ, 'కళకళకోసమే' అనేవాదానికీ మాటల్లోమార్పుతప్ప భావంలోఏమికనపట్టంలేదు. ఈరెండూకళకు ప్రయోజనం ఉండాలనీ, అప్రయోజనం సంఘానికి శ్రేయస్సు కూర్చేదిగా ఉండాలనీ, రచయిత రచనావిశేషం అప్రయోజనాన్ని సాధించటానికి ఉపయోగపడాలనీ, ఒప్పుకోవటంలేదు. వీరి నిర్వచనాలప్రకారం రచనావిశేషమే కావ్యంఅయి కూర్చుంటూ

వుంది. ఒకవేళశర్మగారు వాడిన 'విశేషం' అనేమాటలో ఈఅర్థం ఇమిడిఉంటే చిక్కేలేదు. స్పష్టంగాచెప్పవలసిన అవసరంమాత్రం ఉందంటాను.

కళకుప్రయోజనం ఉండాలీఅంటే, 'ఆ(మాటవరసకు అంటంగానండీ, ప్రయోజనంలేకుండా కళఎట్లావుంటుంది?" అని కొందరు ప్రశ్నిస్తారు. ఈభావం నూతనమైందికాదు- అనాదినుంచీ వొస్తున్నదే. అయితేమానవ జీవితాన్నుంచి సాహిత్యానికి ముడిపెట్టేటప్పటికి కొత్తగా కనిపించవచ్చు.

"అంతా మనమంచికే జరుగుతుంది" అనేమాట ప్రతినిత్యా ఎవరోఒకరి నోటినుంచి మనం వింటూనేవుంటాం. దీనిభావం- భగవంతు డొకడున్నాడనీ, అతడు ఈప్రపంచాన్ని నడుపుతూ వుంటాడనీ, అతడు చాలాగొప్పవాడు అవటం వల్ల ప్రయోజనంలేనిపనులేవీ చెయ్యడనీ,అందువల్ల సంఘంలో, ప్రకృతిలో జరిగే పనులన్నిటికీ ప్రయోజనం ఉంటుందనీ అతడు ధార్మిక బుద్ధిగలవాడు అవటంవల్ల అప్రయోజనం మానవుడికి మంచిజరగటమేననీ; మానవుడు అల్పబుద్ధి గలవాడవటంవల్ల అర్థంచేసుకోలేకపోతే దేవుణ్ణిఅని ఏం(ప్రయోజనం?

ఈతత్వం మనదేశంలో నరనరాలకూ ఎక్కిందని నేనుచెప్పవలసిన పనిలేదు. కానిఅనుభవందీనికి విరుద్ధంగావుంది. శాస్త్రజ్ఞానం ఈ అభిప్రాయం తప్పని రుజువు చేస్తుంది. ప్రకృతిని మానవుడు వుపయోగించుకొని సంఘానికి అభివృద్ధికలిగించాలి. సంఘంలో జరిగే సంఘటనకు ప్రయోజనంకలిపి రచయిత చదువరులకు సక్రమమైన దృష్టికలిగించాలి.

అలాచెయ్యక సంఘంలో జరిగింది జరిగినంతవరకే, చూసింది చూచినంతవరకే చెపితే, అరచయిత కేమెరా భుజాన వేలాడవేసుకొనితిరిగే ఫొటోగ్రాఫరుగా మాత్రమే పనిచేసిన వాడవుతున్నాడు. కంటితో చూసిందీ చెవితోవిన్నదీ చేత్తోగీకుతున్నాడేకాని, తానుఏమీభావనచెయ్యటంలేదు. ఉదాహరణకు అడవిబాపిరాజుగారి'గంగిరెద్దుని' చూడండి.

ప్రభువుగారికీ దణ్ణం పెట్టూ
పాదం వొంచీ భక్తినిపెట్టూ
పట్టు శాలువలు కప్పేదరంటా
కాసులుమువ్వలు కట్టేదరంటా
డూడూడూడూ యెంకన్నా

ఇది వాస్తవిక రచనావిధానం అని కొందరు దురభిప్రాయ పడుతున్నారు. కవి భావన చెయ్యకపోవటం వాస్తవికత లక్షణం కాదు ప్రయోజనం కల్పించలేకపోవటం వాస్తవికత కాదు. గార్కీ చెపుతున్నాడు- To invent means to extract from the sum of a given reality its cardinal idea and embody it in imagery - that is how we got realism.

అంతేగాని అసలు కల్పన చెయ్యకపోవటం గానీ, ప్రయోజనంలేని రచనలు చెయ్యటం గానీ వాస్తవికతకాదు. సాహిత్యంలో రచయిత సృష్టించ దలచిన వాస్తవికత సంఘం నిజస్వరూపాన్ని చిత్రించేదిగా ఉండాలిగాని ఒక సంఘటనకు సంబంధించి మొత్తం సంఘపరిస్థితులకు భిన్నంగా ఉండకూడదు. రచయిత సాధించదలచిన ప్రయోజనం మొత్తం సంఘానికి అపకారం చేసేదిగా ఉండగూడదు,

ఈవిషయం మనస్సులోఉంచుకోని రచయితలు ప్రయోజనంలేని రచనలు చేసినవారు అవుతున్నారు. నేనుపైనఉదహరించిన బాపిరాజుగారి 'గంగిరెద్దు'వంటి రచనలకు విలువ ఏముంటుంది? పైగా బాపిరాజుగారు ఎస్కేపిజం కళయొక్క ప్రయోజనం అనిచెపుతారు. ఏమిటిదీనిలోవున్న ఎస్కేపిజం? యిందులో బాపిరాజుగారు దేన్నుంచి తప్పించుకు పోతున్నారు? కళకే అందకుండా, అసలు కళనుంచే తప్పించుకుపోటానికి ప్రయత్నిస్తున్నట్టుంది.

## 'ముగింపు'

లౌకికసమస్యల్ని ఎదుర్కోకుండా తప్పించుకు తిరగటం మనలోఎక్కువ మందికి ఇష్టంగా ఉంటూవుంది. ఈ దృష్టికి భగవంతుడు కారణంకావచ్చు. ప్రేయసి కావొచ్చు 'మనవల్ల ఏమీ అవదు' అనేనిస్పృహ కారణంకావొచ్చు. కారణం ఏదైనా ఎప్పుడూమనమనస్సులు తప్పించుకుతిరగటమే వాంఛిస్తున్నాయనే అంశం నిర్వివాదం.

ఒకప్పుడు భారం భగవంతుని మీదవేసి కూచున్నాం. ఇప్పుడు ఒకవ్యక్తి మీదవేసి కూచోవటం మరిగాం. మనభారం మోసేవాడు మారాడేగాని మనచిత్త ప్రవృత్తి మారింది ఏమీలేదు. ఎవర్నోవొకర్ని గుడ్డిగానమ్మి అతనుచేస్తూవుంటే చూస్తూవుంటం మన కలవాటైంది. ఈ దృష్టినాశనహేతువు. అందుకనే మన

దేశంలో పుట్టిన ప్రతిఉద్యమం గుడుగుడుగుంచంగా తిరుగుతూ వుందిగాని ముందుకు సాగిపోవటం లేదు. క్షేత్రం మంచిదికాకపోవటంవల్ల విత్తనాలెటువంటిని చల్లినా, పుట్టేవి పుట్టగొడుగులే ఔతున్నై.

ఇతరదేశాలతోపోల్చుకొనిచూస్తే మనంనిస్సందేహంగా వెనకపడివున్నాం. ఇప్పుడుమనం ఉన్నపరిస్థితుల్లో ఒకప్పుడు ప్రతిదేశంవుంది. ఆపరిస్థితుల్లో ప్రతిదేశం ఇప్పుడు మనంఆలోచించినట్లుగానే ఆలోచించింది. అంతేగానికొందరు ప్రచారంచేస్తున్నట్టు మనం పాశ్చాత్యులకు ఏదో మహత్తర సందేశం యివ్వటానికి పుట్టాంఅనుకోటందృష్టిదోషం. ఒకప్పుడుపాశ్చాత్యులకుమనం జ్ఞానంప్రసాదించాం అనిచెప్పుకుంటున్నాం. ఇప్పుడు వాళ్లరగ్గరనుంచి పుచ్చుకోటానికి సిగ్గెందుకు? ఇలాగే పాశ్చాత్యులూ అభిమానపడి మనజ్ఞానాన్ని తిరస్కరిస్తే ఇప్పు డెక్కడుండేవాళ్ళు?

గతంలో వున్నమంచిని తీసుకొని, వర్తమానాన్ని అర్థంచేసుకొని భవిష్యత్తుని నిర్మించుకోటానికైతే గతాన్నిమనంపొగుడుకోవచ్చు. అంతవరకేగాక ఇప్పటి సమస్యల్ని పరిష్కరించుకోకుండా గోళ్లగిల్లుకుంటూ కూచోటానికి ఆదికారణం కాకూడదు. ప్రస్తుతపరిస్థితుల్నించి దృష్టినిమరల్చటానికి అది కారణంకాకూడదు. ఇప్పటినాగరికతను తిరస్కరించటానికి అదిఉపయోగింప బడగూడదు.

"పాశ్చాత్య భావాలవల్ల కుర్రవాళ్ళు చెడిపోతున్నారు." అంటారుకొందరు. భావాలకుఎల్లలేమిటి? నవీనభావాలు పాశ్చాత్యులముల్లెకాదే? జాతీయతకుహద్దు వుండాలి. మనదేశమూప్రపంచంలోదే. ప్రపంచంతోపాటు మనమూవృద్ధిచెందాలి. వెనకపడివుంటే వేగంహెచ్చించాలి. 'ఊరంతాఒకదారీ, ఉలిపిపిట్టది ఒకదారీ,' అనిపించుకోగూడదు- అవగూడదు.

ఇందుకు రచయితలు ఎక్కువగా పాటుపడాలి, ప్రజల మనస్తత్వాన్ని మార్చాలి. లౌకికసమస్యనుంచి తప్పించుకుపోయే స్వభావాన్నిమార్చి, కార్యోన్ముఖులను చెయ్యటం ఈనాటిరచయితల ముఖ్యకర్తవ్యం.

సూతాశ్రమం — గోపీచంద్

# పరివర్తనం

ఉదయం మెరుపుల్తో ఉరుముల్తో, పెద్దవర్షం కురిసింది. ఆరోజంతా మసక మసగ్గానే వుంది. ఇంకా తుంపర పడుతూనే వుంది. చలిగాలి వీస్తూ వుంది.

ఆ వర్షానికీ, గాలికీ, ఆతోటలోని మొక్కలన్నీకదిలి, వొక పక్కకివొరిగి, చికాగ్గా వున్నయి. ఆతోటలో రకరకాల చెట్లు, రకరకాల పూలమొక్కలూ వున్నయి. చాలా ఏపుగా మంచి పద్ధతిని పెరిగినట్లే వున్నాయి గాని, ప్రస్తుతం దుఃఖంవల్లా, సంస్కారం లేకపోవటం వల్లా రేగిన స్త్రీ ముంగురులకుమల్లే చిక్కుపడి, అంతా కంగారు కంగారుగా వున్నాయి.

తోట మధ్యగా సన్నని కాలిబాట వుంది. ఆ బాటనుంచి అక్కడక్కడా పక్కనున్న కుటీరాల్లోకి దార్లున్నాయి. తోట మధ్యగా వున్న కాలిబాట స్త్రీ పాపటకు మల్లే వుంది. ఆ దారి నుంచి ప్రక్కకు చీలిన చిన్న దార్లు తమలపాకు ఈనెలకు మల్లే వున్నయి.

ఆతోట మధ్య ఒక కుటీరం వుంది. దానిచుట్టూ గులాబీ మొక్కలున్నాయి—రకరకాల గులాబీలు, గాలికి విచ్చి వూడి కిందపడిన గులాబీ పూలరెబ్బలు, ముక్కలు, ముక్కలుగా చించి పారవెయ్యబడిన ప్రేమ లేఖలను జ్ఞప్తికి తెస్తున్నాయి. వానలో

తడిసి గాలికి ఎగిరేశక్తికూడా వాటికి లేకుండా పోయింది. వాసన వర్షానికి ముందే పోయింది. ఆ కుటీరానికి ఎడంపక్కా, కుడి పక్కా, రెండు అశోక వృక్షాలు నిటారుగా పెరిగి ద్వారపాల కుల్లాగా కాపలా కాస్తున్నాయి. కుటీరానికి ఎదురుగా, గుబురుగా పెరిగిన సంపెంగ చెట్టు వుంది. కుటీరానికి వెనుక భాగంలో తోటని ఆనుకొని, ఒరుసుకొని ఒకనది ప్రవహిస్తూ వుంది. ఆ వూళ్ళో వాళ్ళంతా ఆ నదిని గంగా ప్రవంతి అని పిలుస్తారు.

అది ముద్దు పేరు.

ఒక వ్యక్తి ఆకుటీరంలోనుంచి బయటకు వొచ్చి, ఒక్క సారి తోటంతా కలయచూశాడు. చెదిరిన పూల మొక్కలూ, రాలిన పూలూ, పూల రెబ్బలూ, అతని మనస్సుని కలవర పెట్ట లేదు. తోట మధ్య నిలబడి, తోటపక్కగా ప్రవహిస్తున్న నదిని తదేక ధ్యానంతో చూస్తున్నాడు—చూస్తున్నాడు అంటంకంటే ప్రవహిస్తూ ఆనది చేస్తున్న ధ్వనిని వింటున్నాడంటే సమంజ సంగా ఉంటుందేమో. ఆ ధ్వని అతని మనస్సుని అమిత బాధ పెట్టింది. కాని ఆబాధనుంచి తప్పించుకోటం అతనికి ఇష్టంగా లేదు.అట్లాగే వింటూ నుంచున్నాడు. ఆ గంగాప్రవంతి చేసే ధ్వనికి అతని హృదయంలో అతని భార్యపాడిన పాట కంటే పెద్ద స్థానంవుంది. ఎందు కంటే తనభార్యపాట తానే ఆనందించే వాడు. ఆ నదిచేసే ధ్వనిని మాత్రం తనూ, తనభార్యా ఇద్దరూ కలసి ఆనందిచే వాళ్ళు. తా మిద్దరూ ఎన్ని వెన్నెల రాత్రుళ్ళు గంగమ్మతల్లి అంకంలో గడిపారో! తమ రహస్యాలు ఆమెతో ఎన్ని చెప్పుకున్నారో! ఆ ఇసుక పొరల్లో పక్కపక్కనే, వెల్ల కిలా పడుకొని ఆకాశంలోని చంద్రవంకని చూస్తూ ఆ ధ్వని

వింటూవుంటే మాట్లాడుకో బుద్ధి అయ్యేది కాదు. కాని, హృద యాలు విప్పి మాట్లాడుకుంటున్నట్లే వుండేది. ఒకరి ఆలోచనలు ఒకరికి వినబడుతూనేవుండేవి.హృదయతంత్రులు ఫిడేలురాగాలుగా పనిచేసేవి. గంటలు గడిచిపోతున్న వనే స్పృహే వుండేదికాదు. అసలు కాలం గడవటం అనేది సోమరిపోతులూ, ప్రేమ అంటే ఏమిటో తెలియని వాళ్ళూ, అర్థాయుష్కులూ 'సృష్టించిన మాటగా కనిపించేది.

ఆవ్యక్తిపేరు రాజారావు. ఆ తోట అతన్దే. ఆ తోటకి ఎదురుగా ఆనుకొనివున్న పెద్దమేడ అతని యిల్లు. అతడు ధన వంతుడు. బాగా చదువుకున్నవాడు. యోగ్యుడుగా పేరు పొందిన వాడు. ఎక్కువకాలం తోటలోని కుటీరంలోనే గడుపుతూ వుం టాడు.

అతడు తోటమధ్య నిలబడి గంగాప్రవంతిచేసే ధ్వనిని తదేక ధ్యానంతో వింటానికి కారణంవుంది. ఆ ధ్వని తన జీవి తాన్ని పాడుతున్నట్టు అతనికి అనిపించింది. తనకథను పేజీలు తిప్పి శ్రావ్యంగా చదువుతున్నట్టు అతనికి అనిపించింది. తనజీవి తంలో ఆ తోటకీ గంగా ప్రవంతికీ, తెలియని రహస్యాలూ, బాధలూ, సుఖాలూ లేవు. ఆ నది, ఆ నదిలోని ప్రతి అలా, ఆ తోట, ఆ తోటలోని ప్రతి పూలమొక్కా, తన జీవితంలోని ఒక్కొక్క ప్రకరణానికి ఒక్కొక్క శీర్షికగా కనిపించినై. ఒక్కొక్క పూలమొక్క కింద తన జీవితంలోనే ఒక్కొక్క అధ్యాయం ముగిసింది.

—మొదలైంది.

ఆ మొక్కలన్నీ అతనిభార్య చెలికత్తెలు. అతని భార్య చెప్పలేని మాటలు అవి అతని చెవిలో వూదేవి. తనలో ఎన్ని భావాలను రేపేవి! తన్నూ, తనభార్యనూ చూచి ఎంత ఆనందించేవి? సాయంకాలం అయ్యేటప్పటికి కళకళలాడుతూ ముసి ముసి నవ్వులు నవ్వుతూ తమకోసం ఎదురు చూస్తూండేవి. ఎప్పుడైనా తనభార్యను తీసుకు రాకుండా తాను ఒంటరిగా వొస్తే, అలిగేవి. అలిగి మొహం ముడుచుకొని మాట్లాడించేవి కావు, వాటిని మళ్ళీ దారికి తీసుకురావటానికి ఎంత సముదాయించాల్సి వొచ్చేది! "కాదమ్మా, ఇవ్వాళ మీ స్నేహితురాలికి పనుందమ్మా, రాలేకపోయినందుకు మీతో క్షమాపణ చెప్పమంది." అని ఏమేమో చెప్పితే తప్ప మాట వినేవికాదు.

ఒకసారి తనూ, తన భార్యా మాట్లాడుకుంటూ వుండగా, పక్కనున్న గులాబీపువ్వు జోక్యం కలిగించుకుంది. "అమ్మాయి సిగ్గుపడుతూ వుంది." అని తన చెవిలో వూదింది. అప్పుడతనికి అకస్మాత్తుగా తన భార్యమాటలకు కొత్త అర్థం స్ఫురించింది. వెంటనే ఆమెను చేతుల్లోకి తీసుకొని పెదిమల మీద అంటీ అంటకుండా ముద్దు పెట్టుకున్నాడు. అప్పటినుంచీ ఆ ముసలి గులాబీమొక్క అంటే ఆతనికి అమితమైన ప్రేమ ఏర్పడింది. తన కష్టసుఖాలను కనిపెడుతూ వుండే ప్రాణి ఒకటి వుందిగదా అని ధైర్యం ఏర్పడింది.

విరజాజిమొక్క ఒక సహాయం చేసింది. అతను వేరే పని మీద మరొక వూరు వెళ్ళి రెండురోజులు ఆలస్యంగా వొచ్చాడు. ఆ రెండు రోజులూ అతని భార్య ఎంత బాధపడ్డదో ఆ విరజాజి మొక్క అతనికి చెప్పింది. గంటసేపు చెప్పి చివరికి కన్నీరు

పెట్టుకొని, "ఎప్పుడూ ఆమెను విడిచి పెట్టి వెళ్ళకండీ!" అని బ్రతిమాలింది.

ఇవన్నీ అతనికి జ్ఞాపకం వొచ్చినై. ప్రపంచానికీ అతనికీ సంబంధం అతని భార్యే. ఈ పూలు, ఈ మొక్కలు, ఈనది, ఈ అలలు, ఈ ఇసుకపొరలు, ఈ గాలి—ఇవన్నీ తనమీద ఒకప్పుడు ప్రేమా, ఇప్పుడు భరించలేని జాలీ ఎందుకు చూపిస్తున్నాయి, తన భార్యమూలానే!

ఈ ఆలోచనలతో అతను అలా గంగాప్రవంతి చేసే ధ్వని వింటూ నుంచునే వున్నాడు. ఇంకా అలా ఎంతసేపైనా నుంచునేవాడు. ఎంతసేపైనా వినేవాడు. ఇంతలో అతని ఆరేళ్ళ కూతురు పిల్లవాణ్ణి ఎత్తుకొచ్చి "నాన్నా!" అని పిలిచింది.

అతను ఉలిక్కిపడి "ఏంతల్లీ, ఇట్లావొచ్చావు?" అన్నాడు.

"అబ్బాయి ఏడుస్తున్నాడు నాన్నా."

"ఎందుకు బాబూ?" అంటూ పిల్లవాణ్ణి చేతుల్లో తీసుకొని బుజ్జగిస్తూ అడిగాడు,

నిజంగా పిల్లవాడు ఏడవటంలేదు. పైగా, బుల్లిచేతులు గుప్పిళ్లు బిగబట్టి, ఆకాశంవేపు చూపుతూ, బోసినవ్వు వొలకబోసుకుంటూ, ఆడుకుంటున్నాడు.

"అమ్మ....అమ్మ....అమ్మ.....అమ్మ.........అని ఏడుస్తున్నాడు నాన్నా," అంది కూతురు. ఈసారి తండ్రి మొహం చూడకుండా తల వొంచుకొని విచారంగా చెప్పింది.

కూతురు మాటలకు అతనికి దుఃఖం వొచ్చింది. కళ్ళల్లో నీళ్లు తిరిగినై. ఒక్కక్షణం గడిచిం తర్వాత "ఏం బాబూ, అమ్మ కావాలా? అదుగో—అదుగో చూడు" అని ఆకాశం

వైపు చూసాడు. అప్పుడే ఒక మబ్బుతునక స్త్రీరూపం ధరించబోయి, అంతలో వుపసంహరించుకుంది. అతని మనస్సు కలుక్కుమంది.

అతని కూతురు ఏమీ మాట్లాట్టంలేదు. ఆపిల్ల తన అభిప్రాయాల్ని పిల్లవాడిమీద పెట్టి చెప్పతూవుందని అతనికి అనుమానం కలిగింది. అతనికి కూతురంటే చాలా ముద్దు. అంత చిన్నతనంలోనే తనను పూర్తిగా అర్థం చేసుకున్నట్లు ప్రవర్తిస్తుంది. పొద్దున్న పిల్లవాణ్ణి ఆడిస్తూ, "మా బాబుకి ఇక నేనే అమ్మని, నాకు మానాన్నే అమ్మ" అని తనలో తాను అనుకోవటం అతడు విన్నాడు. ఆపిల్ల మాట్లాడకుండా నుంచుంటే, ఏమి ఆలోచిస్తూ వుందో అని అతనికి భయంవేసింది. తనకూతురు వైపుకి చూట్టానికే అతనికి భయం వేసింది.

"బాబూ' చలిగాలి వేస్తుంది, ఇంటికి వెళ్దామా"? అని కొడుకుని బుజ్జగిస్తూ, కూతుర్ని క్రీగంట చూశాడు.

ఆ పిల్ల తలవొంచుకొని కన్నీరు కారుస్తూ వుంది. అతని హృదయం అమాంతంగా కరిగి నీరయింది. ఆతురతతో, "తల్లీ ఏడుస్తున్నావా?" అని అడిగాడు.

"నాన్నా! అమ్మ....."అన్నది కూతురు.

"తల్లీ, నువ్వు ఏడవటం అమ్మకు ఎంత అయిష్టం? అమ్మకు అయిష్టమయిన పని చెయ్యొచ్చా తల్లీ?" అని కన్నీరు మింగుతూ అడిగాడు,

"నేను ఇక ఏడవను నాన్నా" అన్నది కూతురు.

"మాతల్లి బంగారం—అమ్మమాట ఎప్పుడూ జవదాటదు. మనం ఏడిస్తే, అమ్మకు కష్టంవేస్తుంది. అమ్మకి కష్టం వేసేపని

నాతల్లి చేస్తుందా; రా తల్లీ పోదాంరా," అని పిల్లవాణ్ణి బుజానపెట్టుకొని, కూతుర్ని చేత్తోపట్టుకొని నడిపిస్తూ, కుటీరం ప్రవేసించాడు రాజారావు.

ఆ కుటీరంలో పెద్దనిలువుటద్దం వుంది. దానికి ఎదురుగా ఒక చిన్న టేబిల్‌మీద రాజారావు భార్యఫొటో వుంది. దానికిముందు ఒక ప్లేటుముక్కలో ఇంత కుంకం వుంది. దానికి పక్కన ఒక పెద్ద శంఖు వుంది, గంధపు గిన్నెలో గంధంవుంది. రాజారావు నెమ్మదిగా కొడుకునిదింపి, ఫొటోదగ్గరకు వెళ్ళి రెండువేళ్ళతో గంధంతీసి ఆ ఫొటోకిరాసి, కుంకంతీసి బొటమన వేలితో బొట్టుపెట్టాడు.

"పూలు తెద్దామా తల్లీ?" అనికూతుర్ని అడిగాడు.

"ఎందుకు నాన్నా?"

"మాలగా గుచ్చి అమ్మమెళ్లో వేద్దాం"

"అమ్మకి పూలంటే ఇష్టమేనా?"

"చాలా ఇష్టం తల్లీ. మన తోటలోని పూలమొక్కలు ఎప్పుడూ నీతో చెప్పలేదా?"

"అయితే వేద్దాం, నాన్నా."

అతడు పిల్లవాణ్ణి కూతురికి అప్పజెప్పి, మళ్ళీ తోటలోకి వెళ్ళాడు, రాలిపోయిన పువ్వులూ, పూలమొగ్గలూ జాగ్రత్తగా ఏరి వొళ్లో పోసుకున్నాడు. ముసలిగులాబీచెట్టు పువ్వుకోసంవెళ్ళాడుగాని. ఆ చెట్టున పువ్వు లేదు, చిన్నకొమ్మ తుంపి పట్టుకొచ్చాడు. అతడు కుటీరంలో ప్రవేశించే టప్పటికి పిల్లవాడు శంఖుతో ఆడుకుంటున్నాడు. కూతురు, తల్లిఫొటోకి కుంకమబొట్టు పెడుతూ వుంది.

"ఇవిగోనమ్మా, పూలు." అని వొళ్ళోపూలు చాపమీద పోశాడు.

"అమ్మకి పూలంటే ఇష్టంలేదట, నాన్నా" అన్నది కూతురు.

"ఎవరు చెప్పారు తల్లీ?" అని అతను ఆశ్చర్యంగా అడిగాడు.

"నువ్వు వెళ్ళింతర్వాత అమ్మే చెప్పింది.

అతను మాట్లాడలేదు.

"ఆ కిటికీ తియ్యి నాన్నా, అమ్మకి గాలి కావాలట."

అతను నెమ్మదిగా కిటికీ రెక్కలు విడదీశాడు.

"అబ్బాయిని జాగర్తగా చూడమని చెప్పింది నాన్నా."

"అల్లాగేనమ్మా, అల్లాగే."

ఇంతలో పిల్లవాడు రాజారావు కుమ్మరించిన పూలదగ్గరకు వెళ్ళి, తన బుల్లిచేతుల్తో విరజిమ్మటం మొదలుపెట్టాడు. రాజారావు కుర్రవాణ్ని నెమ్మదిగా తీసి, ముసలి గులాబీ మొక్కకొమ్మ మధ్యకు వొచ్చేటట్టు దండ గుచ్చటం మొదలుపెట్టాడు.

---

## 2

నెలలు గడిచిపోతున్నాయి. రాజారావు జీవితంలో మార్పేమీ రాలేదుగాని, భోజనానికి తప్ప, ఇంటికి రావటమే మానేశాడు. అతడు అస్తమానం ఆ తోటలో, ఆ తోటలోని

కుటీరంలోనే వుండేవాడు. ఆ నదీ, ఆ తోటా, ఆ కుటీరం అవే అతని ప్రపంచం. క్రమక్రమేణా పిల్లలుకూడా అతని దగ్గరకు చనువుగా వెళ్ళటానికీ, మాట్లాట్టానికీ భయపట్టం మొదలు పెట్టారు. అతని అత్తకు, పిల్లల అమ్మమ్మకు, అతని వైఖరి చూస్తున్నకొద్దీ దిగులు ఎక్కువైంది. అమ్మమ్మ, కూతురు పోయినప్పటినుంచీ పిల్లల పోషణకోసం, అల్లుడి ఇంట్లోనే వుంటూవుంది. మొదట్లో అల్లుడు రెండో పెళ్ళి చేసుకుంటాడనీ, తన మనవడూ, మనవరాలూ దిక్కులేని పక్షులవుతారనీ భయపడేదికాని అతని ధోరణి చూసినకొద్దీ, మరొక భయం పట్టుకుంది- తనకూతురుమీద బెంగతో అల్లుడు ఏమైపోతాడో అని. పిల్లలు రెక్కలురాని పక్షులు. నాలుగు కాలాలపాటున ఉంటేనే, ఏదైనా అనుకునేది.

ఆమెకు ఏమీ తోచక, ఈ సంగతి అంతా రాజారావు అక్కకు ఉత్తరం రాయించింది. రాజారావుకి ఆ చాలా భక్తి. ఆమెక్కూడా తమ్ముడంటే అమిత భర్త ఎక్కడో దూరంగా ఉద్యోగం చేసుకుంటున్నా ఒక్కడే కొడుకు. ఆమె రాజారావుకిమల్లే జీవిత తన జీవితంతో తాను సంపూర్తిగా రాజీ పడిన మనిషి. ఆమె అమ్మమ్మ రా

"ఉన్నారమ్మా....ఇరుగో....నీ కోసం నిన్నటినుంచీ ఎదురుచూస్తున్నారు. ఈ పిల్ల మరీని. బావా....బావా....అని కలవరించావుగదే.... ఇంకేం? అడుగో బావ వొచ్చాడు, పోయి కావలించుకో" అంది అమ్మమ్మ.

అక్క అమ్మమ్మతో మాట్లాడుతూనే తన సామాను సర్దుకుంది. అన్ని గదులూ తిరిగి ఇల్లంతా కలయచూసింది. ఇల్లు ప్రతి అంగుళంలోనూ తన తమ్ముడు పడుతున్న బాధ స్పష్టంగా గోచరించింది. ఇల్లంతా చిందర వందరగా వుంది. పిల్లల బట్టలూ పెట్టెలూ ఎక్కడ వేసినవి అక్కడే వున్నాయి.

అమ్మమ్మ ఆంతర్యం కనుక్కుంటేగాని లాభం లేదనుకుంది అక్క.

ఆమెకు అమ్మమ్మ స్వభావం బాగా తెలుసు. అమ్మమ్మ పూర్వకాలం మనిషే అయినప్పటికీ మొండి మనిషి కాదు. తెలుసుకునే గుణం వుంది. కష్టం ఎవరికి వొచ్చినా తనకు ట్టుగానే భావించుకొని సానుభూతి చూపగలిగిన శక్తి క్కకి ఈ సంగతి తెలుసు. అయినా మనం ముందుగా అమ్మమ్మని జాగర్తగా మాటల్లోకి దింపింది. గా చూస్తున్నాడా?" అని అడిగింది.

నిట్టూర్పు విడిచి ఇలా అడిగింది. "అయితే అమ్మమ్మా ఏవన్నా సంబంధాలు వొస్తున్నాయా, తమ్ముడికి?"

"వొస్తున్నాయమ్మా....కాని, ఏం లాభం?"

"ఏం అత్తా? అలా అంటున్నావు?"

"ఏమోనమ్మా....ఆయన ఎంతసేపూ అమ్మాయి బొమ్మ ముందు పెట్టుకొని ఆ గుడిసెలో కూర్చుంటున్నాడు. ఏమవుతుందో అని భయంగా వుంది. నేనా ముసలిదాన్ని. ఈ పసికందుల్ని చూట్టం నాచేత ఏమవుతుంది?"

ఈ మాటలతో అక్క మనస్సు పూర్తిగా కుదుట పడ్డది. తన తమ్ముని కోసం అమ్మమ్మ పడే ఆరాటానికి మనస్సులో కృతజ్ఞత చెప్పుకుంది. నిజంగా ఆ క్షణం అమ్మమ్మ ఆమె కళ్ళకు దేవీ విగ్రహంలాగు కనిపించింది. కొంచెంసేపు ఆలోచిస్తూవుండి చివరకు, "తమ్ముడు ఏడీ?" అని అడిగింది.

"తోటలోనే ఉన్నారు."

"నేను పిలుచుకొస్తా" అని ఆమె రెండడుగులు వేసింది.

వొద్దు. పిలుచుకురావటానికి నీ కోడలు వెళ్ళింది. నువ్వు ఈలోగా స్నానంచెయ్యి, ఇద్దరూ భోజనానికి కూర్చుందురుగాని. ....ఏడీ? ....పిల్లవాడుకూడా వెళ్ళినట్లున్నాడే!"

"ఇంకేం? దాన్తోకలిసి వెళ్ళాడుకాబోలు" అని ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ అంది అక్క.

ముసలమ్మ ఆమెతో మాట్లాడుతూనే ఉంది గాని, మనస్సు ఇంకొక పక్కకు లాగుతూవుంది. తనబాధ ఆమెకు వెళ్ళబోసుకోవాలని తహతహలాడుతూవుంది. నెమ్మదిగా "ఈ కాప

రం నేను దిద్దలేనమ్మా? నాకేమిటో భయంగా వుంది. నువ్వ్వే వుండి ఈ కాపరం గట్టెక్కించిపో, తల్లీ'' అంది.

"ఏం అత్తా, అలాఅంటున్నావు? నిన్ను తమ్ముడు బాగా చూట్టం లేదా ఏమిటి? వాడి హృదయం చాలా మంచిది. కల్మ షం లేనివాడు." అంది అక్క.

"అవునమ్మా, అవును. అవన్నీ నాకు తెలుసు. కాని ఆయన్ని చూస్తూవుంటే నాకేదో భయంగా వుంది '' అని ఆమ్మమ్మ ఏమో చెప్పబోయింది.

ఇంతలో వాకిట్లో అడుగుల చప్పుడు వినబడగా, అమ్మమ్మ సంభాషణ ఆపివేసింది. రాజారావు ప్రవేశించాడు. అతన్ని చూడ గానే అక్కకు ఆశ్చర్యం వేసింది. కొన్ని నెలల్లో గుర్తుపట్ట టానికి వీల్లేకుండా మారిపోయాడు. చిక్కి సగమైనాడు. మొహం కళావిహీనమైంది. అతని చూపులు ఆమెకు భయంవేసింది. చనిపోయేముందు వాళ్ళ అమ్మ అల్లాగే చూసింది. ఆ చూపులు క్షణం కూడా ఒకచోట నిలవటం లేదు. ప్రతిక్షణం దేనికోసమో వెతుకుతున్నాయి. కాని, ఆ చూపుల్లో శక్తి లేదు, కాంతి లేదు, ఉత్సాహం లేదు. అక్క అల్లాగే రాజారావుని చూస్తూ నిలబడి పోయింది.

"అక్కా, ఎప్పుడొచ్చావు,'' అన్నాడు రాజారావు. అతడు ఆమెను చూట్టంలేదు. గోడమీద వున్న తన భార్య ఫొటోనే చూస్తూ ప్రశ్నించాడు.

"ఇప్పుడే వొచ్చారా అంతా బాగున్నారా?''-అడిగింది, అక్క.

ఆ ప్రశ్నకు అతను జవాబు చెప్పలేదు. "బావ ఏం చేస్తున్నాడు?'' అని అడిగాడు. ఒక్క క్షణం, అతను తనతో మాట్లాడుతున్నాడా, ఆ ఫొటోతో మాట్లాడుతున్నాడా, అని ఆమెకు సందేహం కలిగింది. ఆమె జవాబు చెప్పలేదు. అతను మళ్ళీ అడగనూలేదు. ఆ ఫొటో చూస్తూనే "అన్నం వడ్డిస్తావా?" అన్నాడు.

అమ్మమ్మ అతని కూతురు చెవిలో ఏమోచెప్పి పంపింది. ఆ పిల్లవొచ్చి, "అత్త స్నానం చేసి వొస్తుంది. తర్వాత మీ యిద్దరికీ అమ్మమ్మ వొడ్డిస్తుంది" అన్నది.

అతను ఉలిక్కిపడి కూతురువంకకు చూశాడు. మళ్ళీ అవే చూపులు. అసలు అతడీలోకంలో ఉంటున్నట్టే లేదు. పిలిచినప్పుడు తప్ప బాహ్య ప్రపంచం అతనికి జ్ఞాపకం వుంటున్నట్టే లేదు. మాట్లాడకుండా కుర్చీలో కూర్చున్నాడు.

అక్క ఆలోచించింది.అమ్మమ్మ భయానికి అప్పుడామెకు కారణం తెలిసింది. తను నిర్వర్తించవలసినపని చాలావున్నట్టూ, అది కష్టతరమైన పని అయినట్టూ, ఆమెకు అప్పుడు బోధ పడింది. తమ్ముణ్ణి మాటల్లోకి దింపాలని "బావ యీమధ్య డిప్టీ కలెక్టరు అయ్యారు" అని చెప్పింది.

"ఆ! ఏమిటీ?" అని అడిగాడు రాజారావు.

"బావ.... ఈమధ్య.... డిప్టీ కలెక్టరు అయ్యారు" అనిమళ్ళీ చెప్పింది.

"ఎవరూ?"

"బావ"

"ఏమయ్యారు?"

అంతే, ఇక మాట్లాడలేదు. ఆమె ఆలోచిస్తూ కూర్చుంది. ఎన్ని రోజులు ఉండాల్సివొచ్చినా సరే ఉండి, తమ్ముణ్ణి దారికి తీసుకురావాలని మనస్సులో నిశ్చయం చేసుకుంది.

అంతలో రాజారావు కూతురు వొచ్చి "స్నానానికి లే అత్తయ్యా" అని పిలిచింది.

"నాన్న చెయ్యొద్దూ?"

"నాన్న పొద్దున్నే గంగలో స్నానంచేస్తారు...." అంది.

"అట్లనా" అంటూ ఆమె లేచింది. లోపల అమ్మమ్మని కలవగానే "మంచిపని చేశావు అత్తయ్య- నాకు ఉత్తరం రాయటం మంచిపనే అయింది. అయితే అత్తయ్యా, తమ్ముడు ఎన్నాళ్లనుంచి ఇట్లా వుంటున్నాడు?" అని అడిగింది.

"ఎన్నాళ్ళనుంచి అని చెప్పను? క్రమక్రమేణా ఇట్లా అయిపోతున్నారు, ఇప్పుడయినా కూతురుతో బాగానే మాట్లాడుతారు."

అక్క ఏమో ఆలోచించుకుంటూ స్నానానికి వెళ్ళింది.

పక్కగదిలోనుంచి తమ్ముని మాటలు ఆమెకు వినిపించినై. అతను కూతురుతో, "నాకు ఆకలికావటంలేదు తల్లీ. నేను వెళ్ళిపోతాను. తోటలోవుంటాను." అంటున్నాడు.

"అదేమిటినాన్నా? ఇప్పుడు అన్నం వొడ్డించమన్నావుగా" అంటున్నది కూతురు.

"ఆకలి కావడంలేదు తల్లీ"

"అట్లా చూడునాన్నా- అమ్మనిచూడు- అమ్మ ఏమంటూ వుందో? నిన్ను అన్నం తినమంటూవుంది." అంటున్నది కూతురు.

"అట్లనా తల్లీ" అంటున్నాడు రాజారావు ఆశ్చర్యంగా. ఈ శరీరాన్ని కొన్నాళ్ళు కాపాడుకోమని తన భార్య ఆజ్ఞాపిస్తున్నట్టుగా అతడు అర్థంచేసుకున్నాడు.

అక్క ఈ సంభాషణ శ్రద్ధగా విన్నది. కోడలు తెలివికి సంతోషించింది. తాను తలపెట్టిన పని ఆమెకు మొదట అనిపించినంత కష్టం అనిపించలేదు.

---

## 3

రాజారావు అక్క మనస్సులో ఏమి అనుకుంటూవుందో గాని, పైకిమాత్రం రాజారావుతో ఏ విషయమూ ప్రస్తావించటం లేదు. పైగా తను ఆ యింట్లో లేనట్టుగా కనిపించటానికే ఎక్కువ ప్రయత్నం చేస్తూవుంది.

ఆమె చేస్తున్న పని ఒక్కటే—మేనకోడల్ని దగ్గరకు తీసి ఆ పిల్లకు ఎక్కువ చనువు ఇచ్చింది. ఆ వంకా యీ వంకా పెట్టి కోడల్ని రాజారావు దగ్గరకు కుటీరంలోకి పంపుతూ వుంటుంది. ఆపిల్ల వొచ్చింతర్వాత అక్కడ జరిగిన సంగతులూ, రాజారావు మాట్లాడిన మాటలూ, ఆ పిల్ల వేసిన ప్రశ్నలూ, అన్నీ చెప్పించుకొని శ్రద్ధగా వింటూవుంటుంది. కొన్ని కొన్ని సందర్భాల్లో ఇలా అడక్కపోయావా? అలా అడక్కపోయావా, అని ఆ పిల్లకు కొన్ని కొన్ని ప్రశ్నలు అందిస్తూ వుండేది.

మర్నాడు ఆ పిల్ల ఆమె చెప్పిన ప్రశ్నలకు జవాబులు తెస్తూ వుండేది.

ఒకరోజు రాజారావు ఇంటికి రాగానే కూతురు ఎరుదుగా పరుగెత్తుకుంటూ వెళ్ళి, కాళ్ళు వాటేసుకొని "రేపు మన కృష్టయ్య మామయ్య వొస్తాడునాన్నా" అంది. "ఎవరు తల్లీ?" అని అడిగాడు రాజారావు. అతనికి ఆ పేరు ఎక్కడో విన్నట్టు వుంది. స్పష్టంగా అతనెవ్వరో తనకి జ్ఞాపకం రాకపోయినా, లీలగా సంతోషం కలిగింది.

"మన మామయ్య నాన్నా- కిష్టయ్య మామయ్య. అమ్మ వుండగా వొచ్చేవాడే ఆ మామయ్య," అనిపిల్ల చెప్పింది.

"మన కిష్టడురా! రేపు వొస్తానని ఉత్తరం రాశాడు. చెల్లెల్నికూడా తీసుకువొస్తాట్ట" అని అక్క అందుకుంది.

కిష్టుడు అనేటప్పటికి రాజారావు ప్రాణం లేచివచ్చింది, కిష్టయ్య మామయ్య అని కూతురు చెప్పగానే కిష్టుడు జ్ఞాపకం రానందుకు నొచ్చుకొన్నాడు.

కిష్టుడు అతని ప్రాణస్నేహితుడు. వాళ్ళిద్దరూ చిన్నప్పటి నుంచీ ఒకేచోట చదువుకున్నారు. ఒకేచోట వుండేవాళ్లు. చదువు పూర్తి అయింతర్వాత కిష్టుడు ఉద్యోగంలో చేరాడు. కాని, ఎక్కడున్నా, ఏంచేస్తున్నా, ఏడాదికి ఒకటి రెండుసార్లు అయినా వొచ్చి, ఒక నెలరోజులు రాజారావుతో కాలక్షేపం చేసి వెళ్తే గాని, అతనికి తోచేదికాదు. కిష్టుడు ఒక్క రాజారావు స్నేహితుడే కాదు, ఇంట్లో అందరికీ అమ్మమ్మతోసహా అతనంటే ప్రాణమే. రాజారావు భార్యక్కూడా అతనంటే చాలా చనువూ, ఇష్టమూ వుండేది. 'అన్నయ్యా, అన్నయ్యా' అంటూ

తిరుగుతూ వుండేది. కిష్టుడి పెళ్ళికి, పెళ్ళికూతుర్నిచూసివొచ్చింది రాజారావు భార్యే. చూసి వొచ్చి 'నీకు తగిన పిల్ల అన్నయ్యా, తప్పకుండా ఆ పిల్లనే చేసుకో?' అని సలహా చెప్పింది. కిష్టుడు కూడా ఆమెమాటవిని ఆ పిల్లనే చేసుకున్నాడు. అంతకంటే మంచి సంబంధాలు వొచ్చినా నిరాకరించాడు. కిష్టుడి పెళ్ళికి పెత్తనం అంతా రాజారావుభార్యదే. చెంగు నడుంలో దోపి, పెత్తనం చేసిన ఆ మూర్తి రాజారావు కళ్ళల్లో ఇంకా కదుల్తూనే వుంది.

అటువంటి కిష్టుడు—తనకూ తన భార్యకూ ఇంత దగ్గరగా వుండే కిష్టుడు- వొస్తున్నాడనేటప్పటికి నిజంగా అతని ప్రాణం లేచివొచ్చింది. తటాలున అతని కళ్ళు మెరిసినై.

"కిష్టుడు వొస్తున్నాడా అక్కా? నిజంగా వొస్తున్నాడా?" అని అడిగాడు. అంత ఆతురతా, సంతోషం, తన తమ్ముని మొహంలో చూట్టం ఆమెకు ఇన్నాళ్ళకుగాను అదే మొదలు. అప్రయత్నంగా ఆమె కళ్ళల్లో ఆనందాశ్రువులు తిరిగినై.

"అవున్రా....ఇదుగో, వాడే వుత్తరం రాశాడు. చెల్లాయిని కూడా తీసుకు వొస్తున్నాట్ట. పాపం, మరదలు పోయిందని తెలియగానే ఎంత బాధపడ్డాడనుకున్నావు? పసిపిల్లవాడు ఏడ్చినట్టు ఏడ్చాడు. నీకు జ్ఞాపకం వుందో లేదోగాని, వాళ్ళు అయిదారు నెలల్నించీ మేము వుంటున్న వూళ్ళోనే వుంటున్నారు. వాళ్ళ ఇల్లు మాఇంటికి దగ్గర్లోనే వుంది. కిష్టుడి చెల్లెలు శాంత ఎప్పుడూ మా ఇంట్లోనే ఉంటుంది. నన్ను విడిచిపెట్టి ఒక్కక్షణంకూడా వుండదు. మీ బావక్కూడా ఆ పిల్ల అంటే చాలా యిష్టం. 'ఎక్కడైనా మనలోనే మంచి సంబంధం వెతికి పెళ్ళి

చెయ్యాలి' అంటూవుంటారు. నువ్వు ఆ పిల్లని చూడలేదుగాని ఎంత మంచిపిల్ల అనుకున్నావు! చక్కని చుక్క. అన్నీ కిష్టుడి గుణాలే: ఆ కలుపుగోలుతనం, ఆ మర్యాదా, ఆ అదకువా— చాలా మంచి పిల్ల. కిష్టుడికి చెల్లెలు అంటే ప్రాణం" అన్నది.

"కిష్టయ్యమామయ్య చెల్లెలు నాకేమవుతుంది అత్తయ్యా?" అని అడిగింది మేనగోడలు.

"పిన్ని అవుతుందమ్మా, పిన్ని"

"అయితే పిన్ని మన ఇంటికి వొస్తుందా అత్తయ్యా?"

"వొస్తుందమ్మా....నన్ను చూచిపోదామని వొస్తుంది. నాలుగురోజులుండి మేమిద్దరం వెళ్ళిపోతాం."

"అదేమిటి అత్తయ్యా? నువ్వు వెళ్తే ఎట్లా?"

"ఏమే, నేసుండిమాత్రం ఇప్పు డేంచేస్తున్నాను?"

"నువ్వు వెళ్ళటానికి వీల్లేదు అత్తయ్యా, పిన్నికూడా ఎప్పుడూ ఇక్కడే వుండాలి."

"అదేమిటే? ఆపిల్ల ఇక్కడ ఎందుకు వుంటుంది?"

"ఎందుకు వుండదు? 'పిన్నీ, పిన్నీ, నువ్వు ఎప్పుడూ ఇక్కడే వుండాలి' అని నేను అడుగుతాను. ఉండకేం చేస్తుందో చూస్తాను" అంది మేనగోడలు.

"అడుగమ్మా, అట్లాగే అడుగు. దానికీ నీకూ ఇష్టమైతే ఇక ఈ ఇంట్లో కాదనే దెవ్వరు?

రాజారావు ఈ సంభాషణ వింటూ నుంచున్నాడు. అతడు వింటున్నాడని అక్కకి తెలుసు. అందుకనే మేనగోడల్ని దగ్గరకు తీసి ఇట్లా అంది– "ఎవరుండి ఏంచేయగలరమ్మా? ఎవరి

కష్టాలు ఎవరు తీర్చగలరు, మాపైతే చెప్పగలంగాని పని చేయించలేం గదా?''

"నువ్వు వుండకపోతే అమ్మమ్మకూడా ఉండనంటూవుంది అత్తయ్యా."

అమ్మమ్మ వుంటేమాత్రం ఎన్నాళ్ళు వుంటుందమ్మా, ఎప్పుడో ఆమే గుటుక్కుమంటుంది.''

---

## 4

మర్నాడు కిష్టుడూ అతనిచెల్లెలు శాంతా ఇద్దరూ వొచ్చారు. శాంత రాగానే రాజారావు అక్క ఆమెను దగ్గరకు తీసుకొని తల నిమురుతూ, "వొచ్చావటే· నేనిక్కడ వుంటున్నా మనస్సంతా నీమీదే వుంది. రోజుకి ఏ నాలుగైదు సార్లయినా నువ్వు జ్ఞాపకం వొస్తూవుంటావు." అంది.

శాంత ఏమీ మాట్లాడలేదు. అక్కని చూడగానే శాంత హృదయం ఆనందంతో నిండిపోయింది. మాట్లాడలేకపోయింది. తల వొంచుకొని నిలబడింది. ఆపిల్ల మనస్సూ స్వభావం అక్కకి పూర్తిగా తెలుసు. ఆమె ముసిముసినవ్వులు నవ్వుకుంటూ "ఇంటి దగ్గర అంతా బాగున్నారటే?" అని అడిగింది.

శాంత తలవూపింది.

"మీ అన్నయ్యగారు ఏంచేస్తున్నారు? నేను జ్ఞాపకం వున్నానా? మరచిపోలేదుగదా?"

అన్నయ్యగారు ఆమెఅంటే చాలా ప్రేమగా వుంటారని శాంతకి తెలుసు. అంత పెద్దవారయినా ఆమెను ఒక్కక్షణం కూడా విడిచిపెట్టి వుండలేరనే విషయంకూడా ఆమెకు తెలుసు. అందుకని అక్కమాటలకు తనలో తాను నవ్వుకొంటూ నెమ్మదిగా జవాబు చెప్పింది. "అన్నయ్యగారు బాగానే వున్నారు. ఇల్లు బావురు మంటూవుంది. నాకేమీ తోచటం లేదు. దాన్ని త్వరగా రమ్మను అని చెప్పమన్నారు." అక్క నవ్వుతూ శాంతని క్రీగంట చూసి, చెయ్యి పట్టుకొని అమ్మమ్మ దగ్గరకు తీసుకు వెళ్ళింది.

అమ్మమ్మ పొయ్యిదగ్గర ఏదో పని చూచుకుంటూ వుంది. కిష్టుడూ శాంతా వొస్తున్నారని తెలిసినప్పటికీ శాంతని చూడగానే గుర్తుపట్టలేకపోయింది. ఎవరో పొరుగుపిల్ల అనుకొని "ఎవ్వరే అమ్మా?" అని అక్కని అడిగింది.

"మన కిష్టుడి చెల్లెలు అత్తా, ఇప్పుడే వొచ్చారు" అని చెప్పి లోపలికి వెళ్ళింది.

"నువ్వా అమ్మా? చూశావా? గుర్తే పట్టలేక పోయాను. ఎంతదానివయ్యావే?" అని వొళ్ళంతా నిమురుతూ "రా అమ్మా, రా," అని కూర్చోబెట్టి చేతులోని పని గబగబా పూర్తిచేసుకొని మాటల్లోకి దింపింది.

"అమ్మా, నువ్వూ కిష్టుడూ వొచ్చేస్తే, ఇంట్లో ఎవ్వరు వుంటారు?

"అమ్మ ఉందిగా"అన్నది శాంత.

"వుందిలే. అదీ నేనూ వుండక ఏమవుతాం? పదిమంది వొచ్చేపోయే సంసారం ఆయె! అదొక్కతీ చెయ్యగలుగుతుందీ!

ఏమోనమ్మా, ఏం ఉద్ధరిస్తారో. ఈ పసికూనలమీద కళ్లుపెట్టు కొని నేనూ, మీమీద కళ్ళుపెట్టుకొని అదీ బతుకుతున్నాం."

శాంత ఏమీ మాట్లాడలేదు. మళ్ళీ అమ్మమ్మే అందుకుంది.

"ఏమే, వొదినె నీళ్ళు పోసుకుందా?"

"ఇంకా లేదు అమ్మమ్మా.... మొన్నే పుట్టింటివాళ్ల పంపమని ఉత్తరం రాస్తే, అన్నయ్య పంపించి వొచ్చాడు."

"అమ్మాయీ, తెలియక అడుగుతానూ, అత్తా కోడళ్లు కలుపుగోట్టుగా వుంటారా?"

"అమ్మకి వొదినె అంటేనే ఎక్కువ ఇష్టం. నేను మాట విననని, వొదిన్ని చూసి నేర్చుకోమనీ కోప్పడుతూ వుంటుంది. వొదినెకూడా అమ్మంటే అట్లాగే వుంటుంది."

అమ్మమ్మ మొఖం శాంతదగ్గరకు వొంచి, "సరేగానీ, నీ మాటేమిటే? పెళ్ళిమాట ఏమన్నా అను కుంటున్నారా?" అని ఎంతో అనునయంగా అడిగింది.

శాంత సిగ్గుతో తలవొంచుకుంది. "చెప్పవే, సిగ్గెందుకూ?" అంది అమ్మమ్మ.

"ఊరుకో అమ్మమ్మా, ఏంమాటలవి," అంది శాంత.

"ఇందులో తప్పేమి వుందే, ముసలిదాన్ని తెలుసుకుందామని అడిగాను. చెప్పమ్మా, నాతో చెప్పు."

"నాకు తెలియదు."

అమ్మమ్మ నవ్వుతూ "ఈరోజుల్లో తెలియని పిల్లలు ఎవ్వరుంటారే—నన్ను ముసలిదాన్ని చేసి, ఆడించాలని చూస్తున్నావుగానీ" అంది.

ఇంతలో అక్క పిల్లల్ని తీసుకువొచ్చి "శాంతా, ఇదిగో, ఈబిడ నాకోడలూ; వీరు మా అల్లుడుగారూ" అంటూ పిల్లల్ని అందించింది.

శాంత పిల్లవాణ్ణి చేతుల్లోకి తీసుకుంది. పిల్లలు ఆమెకు అంతలో మాలిమి అయ్యారు. పిల్లవాడు శాంత ముంగురులతో ఆడుకుంటూ కేరింతలు కొడుతున్నాడు, పిల్ల ఆమెని అనేక ప్రశ్నలు వేస్తూ, కబుర్లు చెపుతూ కూర్చుంది. అయిదు నిమిషాలు గడిచేటప్పటికి తన సంగతీ, తమ్ముడి సంగతీ, తోటసంగతీ అన్నీ చెప్పేసింది.

"తోటలో రెండు అశోక చెట్లున్నయి."

"నాన్నకి నేనంటే యిష్టం."

"రోజూ తోటలో పువ్వులు తెచ్చిపెడతా."

"కుటీరంలో అమ్మ ఫొటో వుంది."

"అబ్బాయికి మాటలురావు. మంచినీళ్ళు అంటానికి 'బియ్' అంటాడు. కాకి అంటానికి 'అంబుజ' అంటాడేమిటి పిన్నీ?"

ఈవిధంగా ఆ పిల్ల మాటలు కొట్టిపోస్తుంటే, శాంతకి అమితానందం కలిగింది. పిల్లణ్ని ఆడిస్తూ, పిల్లమాటలకు నవ్వుకుంటూ కూర్చుంది,



రాజారావు తోటలో వున్నాడని తెలుసుకొని కిష్టుడు వొచ్చీ రావటంతోనే అక్కడకు వెళ్ళాడు; కిష్టుడు వెళ్ళేటప్పటికి రాజారావు కుటీరంలో పరధ్యానంగా కూర్చొని ఉన్నాడు. అతని

ఆకారం, చూపులూ చూచి కిష్టుడు ఖిన్నుడయాడు. అతనిలో వొచ్చిన మార్పుకి బాధపడ్డాడు. పలకరించలేక, ఏమీ తోచక అలాగే నిలబడ్డాడు. ఒక్కక్షణం గడిచిం తర్వాత రాజారావు అతన్ని చూశాడుగాని, అతనుకూడా స్నేహితుణ్ని వెంటనే మాట్లాడించలేకపోయాడు. అతన్ని చూడలేక మొహం తిప్పు కున్నాడు. నెమ్మదిమీద లేచి, స్నేహితుని చెయ్యిపట్టుకుని 'ఇప్పుడే వొచ్చావా?' అని అతనివైపుకి ముఖం తిప్పకుండానే అడిగాడు.

అతని కంఠధ్వని వినగానే కిష్టుడికి భయంవేసింది. అది భగ్నహృదయంలో నుంచి వొచ్చిన మూలుగ్గా, గుండెలు చీల్చు కొని వొచ్చిన నిట్టూర్పుగా అతనికి వినిపించింది.

'అవును' అన్నట్లు తలవూపాడు.

ఇక ఇద్దరూ మళ్ళీ మాట్లాడుకోలేదు. ఒకరికి తెలియ కుండా ఒకరు నెమ్మదిగా తోటలోకి నడిచారు. ఇద్దరూ పూల చెట్ల ముందు నుంచున్నారు. గాలికి కదులుతున్న ఆ మొక్కలు ఇద్దరికీ ఒకేవ్యక్తిని జ్ఞాపకంచేస్తున్నయి. పోషణ లేక మోడులవు తున్న ఆ మొక్కలు ఇద్దరికీ ఒకేవ్యక్తిని జ్ఞాపకం చేస్తున్నయి.

ఇద్దరి మనస్సులూ ఒకందుకే దుఃఖంతో నిండివున్నయి. ఇద్దరూ ఒక్క విషయాన్నిగురించే ఆలోచిస్తున్నారు—బాధ పడుతున్నారు. కాని, ఆ విషయం ఎత్తటానికి ఇద్దరూ భయపడు తున్నారు.

అలా ఎంతసేపు నుంచోటం, కిష్టుడు నెమ్మదిగా కది లించాడు. "ఏమోయి, తోట అంతా ఇలా అయిపోయిందే, పూల మొక్కలు...."

అంతే, ఇక మాట్లాడలేదు. ఆ మాటలతో నిశ్శబ్దం బద్ద

లయింది. కిష్టుడికి భయంకరంగా కనిపించింది. దుర్మార్గం అని పించింది.

'తోట' 'పూలమొక్కలు' అనేటప్పటికి రాజారావు దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు. బొటబొట కన్నీరు కార్చాడు. కిష్టుడు అతన్ని ఓదార్చేస్థితిలో లేడు. ఎంత ఆపుకుందామన్నా ఆగకుండా అతని కళ్ళల్లోకూడా నీళ్ళు తిరిగినై. నెమ్మదిగా నిశ్శబ్దంగా తోటంతా తిరిగారు. మళ్ళీ ఏమీ మాట్లాడుకోలేదు. కాని, మాట్లాడుకోకపోయినా ఒకరి అంతరంగంలో వున్న భావాలు ఒకరికి అర్థమైనై. రాజారావు హృదయంలో వున్న బాధ కిష్టుడికీ, కిష్టుడి హృదయంలో వున్న సానుభూతి రాజారావుకీ అర్థమైంది. మాటల రూపకంగా మాత్రం ఎవ్వరూ రాజారావు భార్య సంగతి ఎత్తనేలేదు.

ఇంటికి వొచ్చి కూర్చున్న తర్వాత ధైర్యంచేసి కిష్టుడు కదిలించాడు— "ఇలాగయితే ఎలాగోయ్? నిజమే, బాధే, కాని ఏదన్నా కష్టం వొచ్చినప్పుడు చేత నయినంతవరకు ఆ బాధని మరచిపోవటానికి ప్రయత్నించాలిగాని, ఎక్కువ చేసుకుంటూ కూర్చుంటే ఎట్లా. మనస్సులో బెంగని పోనివ్వకుండా పట్టుకొని నువ్వు కష్టపడుతూ, చుట్టూ వున్నవాళ్ళనికూడా కష్టపెడితే ఎట్లా? పిల్లలున్నారు, వాళ్ళు ఏమయిపోయేటట్టు?"

రాజారావు కొంచెంసేపు ఏమీ మాట్లాడలేదు. అతని అక్క ఈ సంభాషణ విననట్లుగా వింటూ కూర్చుంది.

"ఇంత బేలవు అవుతావనుకోలేదోయి. బతుకునే నేరంగా చేసుకొని ప్రయోజనం ఏమిటి? నాలుగయిదు నెలలు ఈవూరు విడిచిపెట్టి ఎక్కడైనా తిరిగిరావటం మంచిదని నా ఉద్దేశం"

అన్నాడు కిష్టుడు.

రాజారావు నిట్టూర్చి "లాభంలేదు. ఎక్కడచూసినా, ఆమే కనుపిస్తూవుంది. ప్రతి వస్తువూ, ప్రతి ప్రదేశం ఆమెనే జ్ఞాపకం చేస్తున్నాయి. నాతో ఆమెవున్నట్లే వుంటుంది. ఒక్కొక్కసారి సంతోషకరమైన వార్త ఏదో జ్ఞాపకంవొస్తే, ఆమె నా పక్కనే నడుస్తూ వుందనుకొని ఆమెకు చెప్పటానికి పక్కకు తిరుగుతాను....అప్పుడు....ఆమె వుండదు." అతని మాటలు తడబడినై. పెదవులు వొణికినై. ఒక్క నిట్టూర్పు విడిచి వూరుకున్నాడు.

కిష్టుడు అతన్ని చూడకుండా కిటికీలోనుంచి బయటకు చూస్తూ, "దానికి నువ్వే కారణం. మరచిపోకుండా వుంటానికి ఎన్ని ఫీట్లున్నయ్యో అన్నీ నువ్వే చేసుకుంటున్నావు. ప్రస్తుతం ఆమెను జ్ఞాపకం ఉంచుకోవటమే నీజీవితపరమావధిగా వుంది. నామాట విని మరచిపోటానికి ప్రయత్నించు" అని సలహా చెప్పాడు.

ఈమాటలు రాజారావుని అమితంగా బాధపెట్టినై. "మరచిపోవటమా!" అని కిష్టుణ్ణి నిష్ఠూరంగా చూశాడు. తన భార్యని మరచిపొమ్మని కిష్టుడు ఎట్లా చెపుతున్నాడా అని ఆశ్చర్యపడ్డాడు. కిష్టుడిమీద కోపంవచ్చింది. కష్టంవేసింది.

నిజంగా అప్పటి అతని ముఖలక్షణాలు చూస్తే, కిష్టుడు ఏమైపొయ్యేవాడో! అదిగ్రహించే అయివుంటుంది, కిష్టుడు అతని వంకకు చూడకుండా కిటికీలోనుంచి బయటికిచూస్తూ మాట్లాడాడు.

"మరచిపోక చేసేది ఏముంది, ఉన్నన్నాళ్ళూ నీకూ, నిన్ను నమ్ముకుని నీమీద ఆధారపడి వుంటున్నవాళ్ళకూ, సుఖం

శాంతీ ఉండక్కర్లా? పోనీ, అలా తపించటంవల్ల ఏమన్నా వొస్తుందా, ఏదన్నా సాధింపబడుతుందా అంటే అదీ లేదాయె. చూడు, ఇల్లనేది లేకా, పిల్లలనేది లేకా వాళ్లు ఎట్లా అయిపో తున్నారో!-" అని పిల్లల్ని చూపుతూ అన్నాడు.

రాజారావు పెదవి కదల్చలేదు. సంభాషణ పూర్తి అయి నట్టుగా భావించుకొని మెదలకుండా కూర్చున్నాడు. కిష్టుడి మాటలు అతనికి కర్ణకఠోరంగా వున్నాయి. మధుర గానాలాపం లో జీరపోయిన కంఠధ్వనికిమల్లే బాధపెట్టినయి. మత్తుగా భారంగా నిద్రపోయేవాడికి సూదులు గుచ్చుకున్నట్లయింది.

అక్క ఇది కనిపెట్టి, "ఒరేయ్ కిష్టుడూ, నీకు సంగతి సందర్భాలన్నీ తెలిసిఉండికూడా అట్లా మాట్లాడుతావేంరా? తమ్ముణ్ణి మరచిపొమ్మంటే మాత్రం ఎట్లా మరచిపోతాడు? పువ్వూ పరిమళంలాగా వుండేవాళ్ళుగదా ఇద్దరూను—తుంచివేసు కోవటం మాటలట్రా?" అని అడిగింది.

"అయితే వొదినా, ఇట్లా జీవితం గడవటం మంచిదం టావా ఏమిటి?" అని అడిగాడు కిష్టుడు. "మంచిదని ఎవరం టార్రా? ఉన్న జీవితమంతా తమ్ముడికి ముందే వుంది. అటువం టప్పుడు ఇట్లా మనస్సుని కష్టపెట్టుకుంటూ కూర్చోటం మంచి దని ఎవరంటారు?"

"అయితే, ఇక జరగాల్సింది ఏమిటంటావు వొదినా?"

"వాడికే తెలిసివొస్తుంది. వాడుమాత్రం చిన్నవాడా, చితకవాడా. ఒక కాపరం ఈదవలసినవాడు. తమ్ముడు ఇట్లా బాధపట్టం మరదలకుమాత్రం ఇష్టం వుంటుందా కిష్టుడూ? వాడి కాల్లో ముల్లువిరిగితే, గిలగిలా కొట్టుకొనేదే! వాడీవిధంగా బాధ

పడుతూవుంటే, చూస్తూ వూరుకుంటుందా? ఎప్పటికైనా కర్తవ్యం ఆబిడే బోధిస్తుంది" అంది.

ఇక కిష్టుడు తాను ఉన్న రెండురోజులూ, ఆ ప్రస్తావనే తేలేదు. రాజారావుతోనే కాలం గడిపాడు. నానాటికీ రాజారావుకి ఒంటిరితనం అంటే ఇష్టం ఎక్కువ అవుతూవుందనీ, మానవ స్పర్శే గిట్టకుండా పోతూవుందనీ అతడు గ్రహించాడు. తన స్నేహితుడికోసం లోలోపల చాలా బాధపడ్డాడు. ఏం చెయ్యాలో తోచక వూరుకున్నాడు.

---

## 5

"రాజారావు పని ఏమీ బాగాలేదు ఒదినా! నాకు అతని మనస్సు మారుతుందని నమ్మకం లేకుండా వుంది" అన్నాడు కిష్టుడు వెళ్ళేరోజు అక్కతో.

"తమ్ముడు ఇంత వెర్రివాడు అవుతాడనుకోలేదు కిష్టుడూ. వాడికి ఇంకొక గొడవే లేకుండా పోయింది."

"నువ్వు ఎప్పుడొస్తావు వొదినా?"

"వొస్తారా. నాకు పనులు బోలెడు వున్నాయి. మీఅన్నయ్య గారి సంగతి తెలుసుగా! నేను లేకపోతే భోజనంసంగతి కూడా మరచిపోయి కూర్చుంటారు."

"వొదినా, నువ్వు ఏమన్నా అనుకో. అన్నగారి మంచి చెడ్డలు మేము కనుక్కుంటూ వుంటాంగాని నువ్వు కా-

పాటు ఇక్కడే ఉండు....అతన్ని చూస్తూవుంటే నాకు నిజంగా భయంగావుంది వొదినా! నిన్నటికి నిన్న గంగాస్రవంతిలో కాళ్లు పెట్టుకొని పిల్లవాడికిమల్లే ఆడిస్తూ మబ్బులకేసి చూస్తూ కూర్చు న్నాడు. దగ్గరకు వెళ్ళి భుజం తడితేగాని మనలోకంలోకి రాలేదు. అప్పుడు నన్నుచూచి ఏమన్నాడో తెలుసావొదినా, 'రమ్మంటూం దోయ్. నాకోసం ఎంత బెంగపెట్టుకుందో....పాపం' అన్నాడు."

అక్క కొంచెంసేపు ఆలోచిస్తూ కూర్చొని ఏదో నిర్ధార ణకు వొచ్చినట్టు కనిపించింది. నెమ్మదిగా లేచి లోపలకు వెళ్ళింది.

*

ఆ సాయంకాలం అమ్మమ్మ కిష్టుడితో, అమ్మాయిని నాలుగురోజులు వుంచునాయనా. అది ఇంట్లో అడుగుపెట్టినప్పటి నుంచీ ఇల్లు కళకళలాడుతూవుంది. లక్ష్మి ఇంట్లో అడుగు పెట్టి నట్లు వుంది," అంది.

"పోనీలేరా, అమ్మమ్మ అంతగా అడుగుతూ వున్నప్పుడు నాలుగురోజులు వుండనియ్యి. అదిమాత్రం ఇప్పుడు అక్కడకు వొచ్చి చేసేదేముంధి, నేను వొచ్చేటప్పుడు నాతోపాటు వొస్తుం దిలే అని అక్క మద్దతు.

కిష్టుడు, "అది ఒక్కత్తీ వుంటాపంటుంధో లేదో అమ్మమ్మా!" అని తన అనుమానం వెలిబుచ్చాడు.

"ఉండక యేంచేస్తుంది నాయనా? దానికిమాత్రం ఇక్కడ కాని వాళ్ళెవ్వరు?"

ఇంతలో శాంత పిల్లవాణ్ణి ఎత్తుకొని ముద్దులు పెట్టు కూ వొచ్చింది. పిల్లకూడా వెంటే వొచ్చింది.

"ఏం చెల్లీ? నేను ఇవ్వాళ ఇంటికి వెళ్దాం అనుకుంటు న్నాను. వొదినె నిన్ను ఇంకా నాలుగురోజులు వుంచుకొని తనతో తీసుకువొస్తానంటూ వుంది. ఏమిటీ నీఉద్దేశం? ఉంటావా?" అని అడిగాడు.

శాంత ఏమీ మాట్లాడలేదు.

అక్క అందుకుంది—"ఉంటుందిలేరా. నాకూ ఇక్కడ ఒక్కదానికీ ఏమీ తోచటంలేదు. అసలు నాకేమో దాన్ని చూచి నట్లే లేదు. ఆపిల్లల్ని చూశావా? అది వొచ్చిందగ్గరనుంచీ ఎట్లా అంటిపెట్టుకొని ఉంటున్నారో. ఇప్పుడే వెళ్తే బెంగపెట్టుకునే టట్టు వున్నారు."

"పిన్ని ఎప్పుడూ ఇక్కడే వుంటుంది. నేను రోజూ పిన్నికి మంచి మంచి పువ్వులుకోసి తెచ్చిపెడతాను. ఏం పిన్నీ, నువ్వు ఎప్పుడూ ఇక్కడే వుంటానని నాతో చెప్పలా? నిజం చెప్పు," అని గోముగా అడిగింది పిల్ల.

శాంత నవ్వుతూ తలవూపింది.

"ఓసి, అప్పుడే మా అందరిమాటకంటే దానిమాట నీకు ఎక్కువ అయిందటే!" అని శాంతతో అని, కిష్టుడివైపుకి తిరిగి "ఇంకేంరా, నువ్వు వెళ్ళు మేము ఇద్దరం కలిసి వొస్తాంలే," అంది అక్క.

కిష్టుడు వెళ్ళిపోయాడు. కిష్టుడు వెళ్ళగానే పిల్ల అత్తదగ్గ రకు బుంగమూతి పెట్టుకువచ్చి—"చూడు అత్తయ్యా, బావ ఏం చేశాడో," అని పితూరీచేసింది.

"ఏం చేశాడు?"

"తలమీద పసుపు పోశాడు, అత్తయ్యా"

ఆపిల్ల పితూరీవిని పిల్లవాణ్ణి ఎత్తుకొని నుంచున్న శాంత ముసిముసి నవ్వులు నవ్వటం మొదలుపెట్టింది. అత్త చూచి ఇందులో శాంతకుకూడా కొంత పాత్ర వుందని గ్రహించింది.

"ఏమేశాంతా? ఇదటే నువ్వు చేసేపని?"

"నేనేమీ ఎరగను పిన్నీ, వాళ్ళిద్దరూ ఆడుకుంటూ ఒకళ్ళ తలమీద ఒకళ్ళు పోసుకున్నారు," అంది శాంత నవ్వుతూనే.

"బావతో చెపుతాలే అమ్మా, నువ్వు ముందు పోస్తేగాని పొయ్యొద్దని" అంది అత్త.

"ముందు ఆపిల్లే పోసింది" అని చెప్పింది శాంత.

"చిన్నపిల్లలు ముందుపోస్తేమాత్రం మళ్ళీ పోస్తారా, అత్తయ్యా?" అని అడిగింది మేనకోడలు.

"అదేమిటే! వాడుమాత్రం చిన్నవాడు కాదటే, నాబిడ్డ నీకళ్ళకు ముసలివాడికిమళ్ళే కనుపడుతున్నాడా?" అని అడిగింది అత్త మురిపెంగా.

శాంత తనలో తాను గుక్కలుపట్టి నవ్వుకుంది.

---

## 6

శాంత వొచ్చినప్పటినుంచీ రాజారావు ఇల్లు మళ్ళీ కళకళలాడింది. ఆపిల్ల యింటిపనుల్లో అమ్మమ్మకు సహాయం చేసేది. అక్కతో కబుర్లుచెప్పేది. పిల్లలతో ఆడుకునేది. అక్కకి శాంతని చూస్తే చాలా మురిపెం, చాతయ్యా చాతగాకుండా బట్టలన్నీ మురికిచేసుకుంటూ శాంత ఇల్లు దిద్దుతూవుంటే,

అక్క నవ్వుతూ, "పని అంతా నాకూతురుతోనే చేయిస్తున్న ట్టున్నావే అమ్మమ్మా," అనేది.

"ఏం చెయ్యనమ్మా, నన్నేపనీ ముట్టుకోనివ్వదు. అన్ని టికీ నేనున్నానంటుంది. ఊరుకోవే అంటే వింటేగా. దీన్నిచూచి నీకోడలుకూడా మొదలుపెట్టింది. నిన్న ఇద్దరూ కలిసి తాలింపు చట్టి పగలగొట్టారు...." అంది అమ్మమ్మ.

"ఏమేశాంతా, నీమనస్సుకూడా మనస్సులో వుంటంలేదా యేమిటి, ఏమన్నా వుంటే చెప్పమ్మా త్వరగా పెళ్ళి చెయ్యమని అన్నయ్యగారికి ఉత్తరం రాస్తా" అంది అక్క.

"వూరుకో పిన్నీ....పొయ్యిమీదనుంచి తియ్యబోతే చెయ్యిజారి పడింది."

"వినమ్మా వీళ్ళమాటలు. నేను పగలగొట్టాను అంటుంది ఈపిల్ల. నేను పగలగొట్టాను అంటుంది నీకోడలు."

"అంత అజాగర్తగా వుంటే ఎట్లాగే! అమ్మమ్మ మంచిది కాబట్టి సరిపోయింది. ఇంకొకళ్ళయితే ఈపాటికి కారతను వేసే వాళ్ళు" అంది.

అమ్మమ్మకి తీరిక చిక్కినప్పుడల్లా తన కష్టసుఖాలు శాంతకి చెప్పుకోవటం పరిపాటి అయింది.

"చిన్నప్పుడే తలిదండ్రులు పోయారు."

"జాలితలిచి ఎవ్వరో పెంచుకున్నారు."

"పెళ్ళి అయింది."

"లేకలేక ఒక్కకూతురు కలిగింది."

"ఆ కూతురుకూడా రెండుకాయల్ని భూమిమీద వేసి రాలిపోయింది."

శాంతకూడా అమ్మమ్మ మాటలన్నీ చాలా శ్రద్ధగా వినేది. అమ్మమ్మతోపాటు తానుకూడా కంట తడిపెట్టుకునేది. ఈ కబుర్ల వల్ల శాంతకి అమ్మమ్మఅంటే చాలా జాలీ సానుభూతీఏర్ప డింది. అమ్మమ్మ జీవితంతో తనకు సంబంధం వుందనుకునేది.

అమ్మమ్మ జీవితం తెలుసుకున్నప్పటినుంచీ అమ్మమ్మ కూతురుమీద శాంతకి అభిమానం హెచ్చింది. ఆమెనుగురించి అదీ ఇదీ అమ్మమ్మనడిగి తెలుసుకుంటూ వుండేది. ప్రతి చిన్న విషయంలోనూ, "అక్క ఐతే ఏమిచేసేది?" అని ప్రశ్నించు కుంటూండేది.



ఒకరోజు రకరకాల పువ్వులు ముందు పప్పగా పోసు కొని శాంత పెద్దదండ గుచ్చుతూవుంటే అక్కచూచి, "ఎందుకే అంతదండ గుచ్చుతున్నావు? ఎవరిమెడలో వేస్తావు?" అని అడిగింది.

శాంత గోడకి తగిలించి వున్న ఫొటోచూపిస్తూ, "అక్క మెడలో వెయ్యటానికి పిన్నీ" అంది. అని తదేకధ్యానంగా దండ గుచ్చటం మొదలుపెట్టింది.

అక్కకు ఆశ్చర్యంవేసింది. అమ్మమ్మా శాంతా ఎప్పుడూ ఏదో గుసగుసలాడుకోవటం ఆమె చూచిందిగాని వాళ్ళు ఎక్కువ సేపు తనమరదల్నిగురించే మాట్లాడుకుంటున్నారని ఆమె అనుకోలేదు. అందుకని శాంత ఆమెకోసం దండ గుచ్చటం చూసేటప్పటికి ఆశ్చర్యపడ్డది. శాంతని ఒక్కక్షణం పరీక్షగా చూసింది. శాంతలో ఇదివరకంటే కొంత గాంభీర్యం ఎక్కువ

అయినట్లు గ్రహించింది. ఆమె మనస్సు ఇంకా తెలుసుకోవాలని, "దానికి దండ ఎందుకే?" అని అడిగింది.

శాంత దండ గుచ్చటం ఆపి, "అక్క చాలా మంచిది కాదూపిన్నీ?" అని మొహం పైకెత్తి అడిగింది.

ఆ ఒక్కమాటతో అమ్మమ్మకీ శాంతకీ జరుగుతున్న సంభాషణ స్వభావం ఆమెగ్రహించింది. శాంతమనస్సులో తన మరదలు ఎటువంటిస్థానం సంపాదిచుకుందో అర్థంచేసుకుంది. శాంత బాధ పడటం నేర్చుకుంది. అక్కకళ్లల్లో అప్రయత్నంగా నీళ్లుతిరిగినై. "చాలా మంచిదమ్మా. అటువంటివాళ్ళెక్కడో చెదురుబదురుగా పుడుతూంటారు. ఒక్క మెరుపుమెరిసి పోతూంటారు...." అంది,

"పిన్నీ, అక్కంత మంచివాళ్ళం అవ్వాలంటే ఏం చెయ్యాలి. ఈప్రశ్న అక్కని మరీకదిలించింది. శాంతని కావిలించుకొని తల నిమురుతూ, "నువ్వు ఏమీ చెయ్యక్కర్లే దమ్మా....నువ్వు అక్కంత మంచిదానివీని....మారకుండావుంటే చాల్లే" అంది.

శాంతకళ్ళు చెమ్మగిల్లినై. అక్క శాంత మనస్సుని పూర్తిగా గ్రహించింది. మరదలు మంచిదవబట్టేగా శాంతా,ఇన్ని బాధలు. తమ్ముడుచూశావుగా ఎట్లా అయిపోతున్నాడో! వాడి ముఖాన నవ్వుచూచి ఎన్నాళ్ళయిందే!" అంది.

"అయితే పిన్నీ, అక్కవున్నప్పుడు బావ ఇట్లా వుండే వాడు కాదా?" శాంత ఇట్లా అడుగుతూండగా పిల్లవాడు తప్ప టడుగులు వేసుకుంటూ వచ్చి శాంత వొళ్ళోకి జేరాడు. శాంత పువ్వుల కుప్ప కొంచం ముందుకు నెట్టి, పిల్లవాడికి సూది గుచ్చు కుంటుందేమో అని జాగ్రత్తచేసి పిల్లవాణ్ణి దగ్గరకు తీసుకుంది.

"నువ్వు చిన్నదానివి శాంతా, నీకు తెలియదు. అప్పుడు వాణ్ణి నువ్వు చూసివుంటే ఇప్పుడు నువ్వు గుర్తే పట్టేదానవుకాదు. వాడప్పుడు ఎక్కడుంటే అక్కడే ఆనందంగా వుండేది. ఎప్పుడూ కిలకిల నవ్వుతూ వుండేవాడు. అటువంటి తమ్ముడు ఇప్పుడిట్లా అయ్యాడు. వాడికి తెలియకగాని తనకోసం ఇంత బాధపడుతున్నాడని మరదలుకి తెలిస్తే అది ఎంత బాధపడుతుంది? తమ్ముడు బొత్తిగా ఆలోచించుకోలేకుండా వున్నాడు శాంతా. వాడు ఇట్లాగే ఇంకా కొన్నాళ్లుంటే ఈ పిల్లలు ఏమవుతారు?"

శాంత కళ్ళవెంట నీళ్ళుకారినై. పిల్లవాణ్ణి రక్షించటానికా అన్నట్లు ఇంకాదగ్గరకు తీసుకుంది. కొంచెంసేపువుండి, "అన్నయ్య ఏమన్నాడు పిన్నీ?" అని అడిగింది.

"ఎవరైతే ఏమంటారమ్మా, ఎవరమైనా వాడి సుఖం కోరేవాళ్ళమేగా? ఎట్లాగైనా నా తమ్ముణ్ణి దారికి తీసుకురమ్మని నాకు మరీమరీ చెప్పిపోయాడు...."

శాంత మళ్ళీ దండగుచ్చటం మొదలుపెట్టింది. పిల్లవాడు పువ్వులు విరజిమ్ముతున్నాడు, అక్క వాళ్ళని చూస్తూకూర్చుంది.



# 7

"అమ్మా, గంగమ్మతల్లీ! ఎందుకమ్మా ఇవాళ ఇంత కలవర పడుతున్నావు? ఏంజరిగిందితల్లీ?" అని వొడ్డునకూర్చొని, గంగాస్రవంతి అలలను చేత్తోనిమురుతూ అడుగు తున్నాడు రాజారావు.

ఆనాడు గంగాస్రవంతి రోజుకి మల్లేలేదు చాలా ఉదృతంగా ప్రవహిస్తూవుంది. అలలు లేస్తున్నయి, విరుగుతున్నయి. ఆమె శరీరం తుకతుక వుడికిపోతూ వుంది.

రాజారావు ఎరిగి వున్నంతలో ఆనది ఎన్నడూ అంత కంగారు పడివుండలేదు. గంగా స్రవంతి తన శాంతస్వభావానికి ప్రసిద్ధి.

మరి ఆరోజు ఆమె కేమి భంగపాటు జరిగిందో, ఏమి తొందరపాటు కలిగిందోగాని, నురుగులు కక్కుకుంటూ గుర్రం కదను తొక్కినట్టు నడుస్తూవుంది.

రాజారావు ప్రశ్నకు జవాబు రాలేదు. పైగా కేకలు వేసింది. తనలో తాను గొణుక్కుంది.

గంగమ్మతల్లి వైఖరి రాజారావు మనస్సుని కలవర పెట్టింది- బాధపెట్టింది. నిజంగాఆరోజు ఆమె ప్రవర్తన చాలా విచిత్రంగా వుంది. ఆమె మాటిమాటికీ పురుషుల చేతుల్లోనుంచి తప్పించుకోటానికి ప్రయత్నిస్తున్న స్త్రీకిమల్లే విదిలించుకుంటూ వుంది. జుట్టుముడి వూడిందా, పమిట తొలిగిందా అనే స్పృహ కూడా లేకుండా పరిగెత్తుతూవుంది.

ఎక్కడికి? ఏంజరిగింది?

రాజారావుకి ఆమెప్రవర్తన కష్టంవేసింది. ఆమెను చూడ లేకపోయాడు. కాళ్ళు గంగాస్రవంతిలో పెట్టుకొని కూచున్నాడేమో, నురుగు మోకాళ్ళచుట్టూ అర చేసిపోయింది. దాన్ని చూస్తూ కూర్చున్నాడు. అదికూడా అతనికి భావయుతంగానే కనిపించింది. గంగాస్రవంతిలో నురుగుతో పెట్టిన హద్దు పైభాగం తనది. కిందిభాగం తనదికాదు. చూసినకొద్దీ కాలు ఆభాగానికీ ఈభాగానికీ ఏమీ సంబంధం లేనట్టే కనిపించింది. ఇంత భేదానికి కారణం గంగాస్రవంతి నురుగుతో చెయ్యబడ్డ ఆ అర! మళ్ళీ ఒక అల వొచ్చి అతనీ కాళ్ళని కొట్టుకుంది. అతనికి బాధ ఎక్కువైంది. "ఎందుకమ్మా, ఈ కోపం? కారణం చెప్పు" అని బతిమాలాడు. బుజ్జగించాడు. ఆమెకు ఏదో ఆపద తటస్తించి వుంటుందని అతనిఅనుమానం— "చెప్పుతల్లీ? నీవుకూడా నాకుదూరం అవుతున్నావా?, నేను ఏంతప్పు చేశానని? నీకు ఏం అపకారం చేశానమ్మా? నీబాధలో, తాపంలో, విరహంలో నన్ను భాగం పంచుకోనివ్వు" అని ఎన్నో విధాల బతిమాలాడు.

ఆరోజు గంగాస్రవంతి అతనిమాటలు వినిపించుకునే స్తితిలోలేదు. ఆమెతొందరలో ఆమెవుంది. వొళ్లు విరిచింది, నిట్టూర్చింది. అలలు సర్దుకొని ప్రయాణం సాగించింది. అతడు బతిమాలినకొద్దీ విజృంభించింది.

రాజారావు నిర్ఘాంతపడి చూశాడు. ఒకపడవఅతని ముందు నుంచి వెళ్ళింది. ఆపడవ ముందుభాగంలో వొక పల్లెవాడూ, వెనకిభాగంలో వొక పల్లెవాడూ నుంచొని వున్నారు. మధ్య అర్ధ చంద్రాకారంగా గుడిసెవుంది. ముందు నుంచున్నవాడు "ఒలేయ్, వొడ్డుపడతావుంది. ఒడ్డుపడతావుంది లేయ్" అని కేకవేశాడు.

వెనకనుంచున్నవాడు పురచేత్తో సుతారంగా చుక్కాని తిప్పి, నోటితో పదంపట్టాడు:

పదవే గంగమ్మ తల్లీ
పోదాం పదవే!

ఈపదం రాజారావుని కలవరపెట్టింది. అతని హృదయానికి శూలానికిమల్లే గుచ్చుకుంది. తన గంగాస్రవంతిని ఆ పల్లెవాడు ఎంత చనువుగా పలకరిస్తున్నాడు! తన హృదయంలోని భావం వాడు దొంగిలించి పాడుతున్నాడు:

బలువంత నీమీద
గంగమ్మ తల్లీ
మోపి పోతుండాము
గంగమ్మ తల్లీ

పడవ వొడ్డునుంచి నెమ్మదిగా గంగాస్రవంతి మధ్యకు వెళ్తావుంది. నిర్దాక్షిణ్యంగా అలలని ఛేదించుకుంటూ వెళ్తావుంది. రాజారావు మనస్సు చివుక్కుమంది. గంగాస్రవంతి ఆ కోతని ఎట్లా ఓర్చుకుంటూవుంది? ఆ పడవకి ఆమాత్రం విశ్వాసం జాలీ లేకుండా ఎట్లావుంది? పడవ కోతకి అలలు మధ్యకి తెగి చినుకులై ఎగిరిపడుతున్నయి. కసితో మళ్ళీ అలలరూపం ధరించి పడవని ఎదుర్కుంటున్నయి.

పడవ గంగాస్రవంతి మధ్యకివెళ్ళి వేగం ఎక్కువచేసింది. లోతు ఎక్కువ అవటం అంటే శత్రువుకి లొంగటమే అనేసత్యం రాజారావుకి విచిత్రంగా కనిపించింది.

చుక్కాని పట్టేవాడు అంటున్నాడు:

పిల్లలూ పెళ్ళాన్ని
గంగమ్మ తల్లీ
కనిపెట్టి వుండవే
గంగమ్మ తల్లీ

ఈగంగాస్రవంతి ఎంతమందికి గంగమ్మతల్లి! గంగాస్రవంతి తనదే అనుకున్నాడు. తనకోసం తన భార్యకోసం ప్రవహిస్తూ వుందనుకొన్నాడు. తమకోసం తమకు ఆనందం ఇవ్వటానికి మధురగానం ఆలాపనచేస్తూ వుందనుకున్నాడు. కాని అలాకాదు.

గంగాస్రవంతి మారిపోయింది. గంగాస్రవంతి తనకేకాదు, వినేవాళ్లందరికోసం పాడుతూవుంది. తననిసుఖపెట్టేవాళ్ళ కోసం తనని కష్టపెట్టే వాళ్లకోసం, తనని బతిమాలే వాళ్ళకోసం, తనని బెదిరించే వాళ్ళకోసం, తనమీద ఆధారపడి వున్న వాళ్లకోసం, తనని బలాత్కరించే వాళ్లకోసం, అందరికోసం ప్రవహిస్తూవుంది. పాడుతూ వుంది.

ఆ అందరిలో తాను ఒక్కడు.

ఈభావం అతని హృదయాన్ని చిదిమింది. "అందరిలో తాను ఒక్కడు" "అందరిలో తానుఒక్కడు." ....తన ప్రత్యేకత ఏమీలేదు. గంగాస్రవంతికీ తనకీ ప్రత్యేకసంబంధం ఏమీలేదు. ఆమె ప్రవహిస్తూవుంది. అందరితోపాటు తానూ చూస్తున్నాడు. ఆమె పాడుతూవుంది, అందరితో పాటు తానూ వింటున్నాడు.

"అందరిలో తాను ఒక్కడు."

రాజారావు కాళ్లు గంగాస్రవంతిలోనుంచి తీసుకొని ఇసుకలో పడుకున్నాడు. అతనిగుండెలు బిగబట్టినయి.



సాయంకాలానికి గంగాస్రవంతి ఉద్ధృతం ఎక్కువైంది. కడుపునొప్పితో బాధపడుతున్నట్లు మెలికలు తిరుగుతూవుంది. గంగాస్రవంతి ఉద్ధృతంతోపాటు రాజారావు విచారం ఎక్కువైంది. ఆమె రేపుకుంటున్న అలల్ని చూస్తే, అతని మనస్సు చీకాకుపడ్డది. వొడ్డునవున్న ఇసుకపొరల్ని చూస్తే మనస్సులో దేవింది. ఇసుకపొరలమీది అడుగుజాడల్ని అతడు ఓర్వలేక పోయాడు.

అతనికి ఒక్క గంగాస్రవంతియేకాదు. తనచుట్టూవున్న వాతావరణమే మారిపోయినట్టుంది. గంగాస్రవంతి మీదనుంచి వొచ్చేగాలికూడా అతని శరీరానికి కొత్తగావుంది. పూలమొక్కలన్నా తనమనస్సుకి శాంతి నిస్తయ్యేమోనని, నెమ్మదిగా లేచి అడుగులు ఈడ్చుకుంటూ బయల్దేరాడు. తోటలోకి వెళ్లేటప్పటికి తోటకూడా కొత్తగా కనిపించింది. ఎవ్వరో మొక్కలకు పాదులు తీసిసిళ్లపోశారు. ఆకూ అలం లేకుండా తోటఅంతా శుభ్రంచేశారు. ముసలి గులాబీమొక్క మొగ్గ తొడుగుతూంది

అతనిహృదయం చివుక్కుమన్నది. ఈపూలమొక్కలూ, ఈగంగాస్రవంతీ, ఈగాలీఅన్నీ తనభార్యను, తమస్నేహితురాల్ని మరచిపోతున్నయ్యనీ, ఆమెకు అపచారం చెయ్యటానికి పూనుకున్నయ్యనీ అనిపించింది. బాధతో ఆవేదనతో కంపించిపోయాడు. తన పవిత్రప్రేమకే అపచారం చెయ్యటానికి తలపెట్టినయి! తమ ప్రేమమందిరాన్ని భగ్నం చెయ్యటానికి పూనుకున్నయి!!

ముసలి గులాబీమొక్క దగ్గరకు వెళ్ళి—"ఈ పువ్వు ఎవ్వరికి? ఎవ్వరికి? ఎవ్వరికోసం పూస్తున్నావు?" అని అడిగాడు.

ఇదివరకు ఈమొక్కలన్నీ తన భార్యకోసం, తమకు ఆనందం ఇవ్వటానికి, పూస్తున్నయ్యనుకున్నాడు. కాని యిప్పుడు? తనభార్య పోయింతర్వాత ఈ మొక్కలు, పువ్వులు పుయ్యకుండా చిందర వందరైపోతే తనతోపాటు అవీ తమ స్నేహితురాలి కోసం బాధపడుతున్న వనుకున్నాడు. కానియిప్పుడు? ఈపూలమొక్కలు మళ్ళీయథాప్రకారంగా ఏమీజరగనట్టుగానే జీవించటానికీ, పుష్పించ టానికీ ప్రయత్నిస్తున్నయి.

అతనికి కోపంవచ్చింది— "ఎవరికోసం? ఎవరికోసం? ఎవరికోసం?" అనిప్రశ్నించాడు. ఆకోపంలో ఎంతబిగ్గరగా ప్రశ్నిం చాడో ఏమో! కొంచం దూరంలో మల్లెపొదచాటున కూర్చొని పువ్వులుకోస్తున్న అతనికూతురులేచి, "పిన్నికోసం నాన్నా. పిన్ని పువ్వులు కోసుకురమ్మంది. రోజా పువ్వులుకోసి అమ్మ మెళ్లో దండ వేస్తున్నాం" అంది.

చివరమాట వినేటప్పటికి రాజారావు కోపం దిగజారి పోయింది. కూతురుమీద పట్టలేకుంత అనురాగం కలిగింది. పొద్దునుంచీ అనుభవించిన యాతన ఆ ఒక్క మాటతోనూ మాయం అయింది. "దండ ఎవ్వరుగుచ్చుతున్నా రమ్మా?" అని అడిగాడు. భార్యకి దండగుచ్చటం అతని నిత్యకృత్యాల్లో ముఖ్యాంశం.

"మేమేనాన్నా? నేనూ పిన్నీని. అక్కడక్కడ కన కాంబరం పువ్వులుపెట్టి అచ్చగానువ్వుగుచ్చినట్టే గుచ్చుతున్నాం."

"అట్లనా తల్లీ? అట్లా దండగుచ్చటం అమ్మకు చాలా యిష్టం."

"నాజడ బాగావుందా నాన్నా? పిన్నివేసింది," అని తను వేయించుకున్న రెండు జడలు తండ్రికి చూపింది.

ఆ జడలు చూస్తే రాజారావుకి తన భార్యతో కలసి తిరిగిన రోజులు జ్ఞాపకం వొచ్చినవి. వీటిని జ్ఞాపకానికి తెచ్చిన కిష్టుడి చెల్లెల్ని గురించి ఆలోచించటం మొదలుపెట్టాడు. ఇన్నాళ్లకు గాను ఆపిల్ల అప్పుడే అతనికి జ్ఞాపకంవొచ్చింది. ఆపిల్లని ఎప్పుడో చిన్నప్పుడు చూచాడు.

"ఈ చొక్కా కూడా పిన్నే కుట్టించింది నాన్నా. కుట్టుపని వాణ్ని పిలిపించి ఇల్లాకుట్టు అల్లాకుట్టు అని అన్నీ తనేచెప్పి కుట్టించింది."

రాజారావు ఆచొక్కాని తేరిపార చూచి "చాలాబాగుంది తల్లీ! ఎప్పుడూ ఇల్లాగే కుట్టించుకో" అన్నాడు.

కూతురు తండ్రితోకలసి రెండుఅడుగులు నడచి, "చూశావా నాన్నా, నిన్నఅత్తయ్య పిన్నిని ఏమందో?" అంది.

"ఏమన్నదమ్మా?" అని రాజారావు అతురతగా అడిగాడు.

"అన్నీ మామరదలు చేసినట్టు చేస్తావేమే అంది నాన్నా."

రాజారావు ఆమాటవిని ఒక్కనిట్టూర్పు విడిచాడు. మరొక వ్యక్తి తనభార్య చేసినట్టుగా చెయ్యటం అనేభావం అతన్ని కలవరపెట్టింది. నెమ్మదిగా కుటీరంలోకి బయల్దేరాడు. తాను కోసిన పువ్వులు లంగాలో పోసుకొని కూతురు అతన్ని అనుసరించింది.

రాజారావు కుటీరంలో అడుగుపెట్టి, అడుగు పెట్టినవాడు పెట్టినట్టుగానే నిలబడి పోయాడు. అతనికి కుటీరంఅంతా కొత్తగా కనిపించింది. గజిబిజిగావుండే పుస్తకాలు సర్దివున్నయి. నిలువుటద్దం, టేబిలూ ఎప్పుడూ వుండేచోటలేవు. కుటీరం పరిశుభ్రంగావుంది. కాని అది తన కుటీరంకాదు. భార్యఫొటోకోసం చూచాడు. దాని స్థలంకూడా మారింది. అయితే ఇదివరకంటే

ఇప్పుడే ఉన్నతస్థానంలో వుంది. ఫోటోపక్కన ప్లేటుముక్కకు బదులు ప్లేటువుంది. ప్లేటునిండా కుంకం, గంధంగిన్నె నిండా గంధం వుంది.

తనభార్య ఫొటోముందు ఒకయువతి కూర్చొనివుంది. ఆమెని చూసేటప్పటికి రాజారావుగుండె దడ దడ కొట్టుకోవటం మొదలు పెట్టింది. ఆమె కనకాంబరం చీరెధరించి వుంది.

కనకాంబరం చీరె!!

కనకాంబరంచీరె అంటే తనభార్యకు ఎంత ఇష్టం! తన భార్య కనకాంబరంచీరె కట్టుకొని పూలమొక్కల్లో తిరుగుతూ వుంటే ఏ శాపంవల్లో భూలోకానికి దిగిన దేవకన్యకమల్లే వుండేది.

ఆ కనకాంబరంచీర్తె, ఆ వాలుజడా, అంతా తనభార్యే! తన బాధ చూడలేక మళ్ళీ అవతారం ఎత్తిందా? లేకపోతే అక్కడ ఒకమనిషి వున్నట్టు తాను వూహించుకుంటున్నాడా?

రాజారావు ఈవిధంగా ఆలోచించుకుంటూ ఆ పిల్లనుంచి తనచూపులు మరల్చుకోలేకపోయాడు. ఆ చూపులు ఎంత తీక్షణంగా వున్నయ్యోగాని, గుచ్చుకున్నట్టుగా ఉలిక్కిపడి, ఆ పిల్ల వెనక్కి తిరిగిచూసింది. రాజారావును చూసి తొందరగా లేచి వెళ్ళిపోబోయింది. రాజారావు కూతురు ఆమె చెంగు పట్టుకొని ఆపి "నాన్న పిన్నీ" అని చెప్పింది. ఆమె వెళ్ళకుండా ఆగటానికి అతడు తనతండ్రి అని చెప్పితే చాలని ఆపిల్ల వూహ.

రాజారావు హఠాత్తుగా తన ఆలోచనల్లోనుంచి భూమిమీదకు దిగాడు. ఆమె కృష్ణుడు చెల్లెలు శాంతఅని అప్పుడతనికి తెలిసింది. తనభార్య కట్టుకునే చీరవంటి చీరె ఆపిల్ల కట్టుకున్నందుకు అతనికి కష్టంవేసింది.

"ఇదంతా పిన్నే బాగుచేసిందినాన్నా," అంది కూతురు.

అతడు మాట్లాడకుండా అలాగే చూస్తూ నుంచున్నాడు. తను జోక్యం కలిగించుకున్నందుకు అతడు ఏమన్నా అను కుంటాడేమోనని భయపడి, "అక్కకి పరిశుభ్రంగా ఉంచటం ఇష్టం అని పిన్నిచెప్పింది. అందుకని సర్దాను," అన్నది శాంత.

అతడు మాట్లాడకుండా చూస్తూ నుంచున్నాడు.

"అక్క ఫొటో లక్కడపెట్టాను—గదిలో ఎక్కడున్నా బాగా కనిపిస్తుందని" అంది శాంత. కొంచెం ధైర్యంతెచ్చుకొని.

అతడు మాట్లాడకుండా చూస్తూ నుంచున్నాడు.

శాంతకు అతన్ని చూస్తుంటే భయంవేసింది. తొందరగా "పుస్తకాలన్నీ ఆ అరలో వరసగా సర్దాను. అందుకోటానికి వీలుగావుంటయ్యని...." అని చెప్పింది.

అతడు మాట్లాడకుండా చూస్తూ నుంచున్నాడు. అతడు తనమాటలు వింటంకంటే తన్నే ఎక్కువ చూస్తున్నాడని ఆమె గ్రహించింది తనకాళ్ళకింద భూమి కుంగిపోతున్నది అనిపించింది శాంతకి.

ఇంతలో రాజారావు కదిలాడు. తనభార్య ఫొటోని కొత్త స్థలాన్నుంచి తీసి యథాస్థానంలో ఉంచాడు. శాంత చూసింది. తాను చేసిన మార్పులు అతనికి నచ్చలేదని ఆమె గ్రహించింది. ఆమె మనస్సు చివుక్కుమంది, అక్కడ ఒక్క క్షణంకూడా ఉండలేకపోయింది. అకస్మాత్తుగా ఆమెకు శరీరం బరువు ఎక్కి నట్లు అనిపించింది. రాజారావు ఏం చేస్తున్నాడోకూడా చూడ కుండా వెళ్ళిపోయింది. వెళ్తుంటే ఆమె అడుగులు తడబడినై. శరీరం వొణికింది. శాంత వెళ్ళిపోగానే కూతురు, "అదేమిటి నాన్నా? పిన్ని వెళ్ళిపోయిందే!" అని అడిగింది.

అప్పుడతనికి కొంత వెళ్ళిపోయినట్లు తెలిసింది. కాని ఆ విషయానికి అతడు ఎక్కువ విలువ ఇవ్వలేదు. కొంచం విసుగ్గా "ఏమోనమ్మా" అన్నాడు.

"అమ్మఫొటో పిన్ని పెట్టినచోట వుంటేనే బాగుంది నాన్నా. ఇక్కడ అట్టే బాగాలేదు. చూడునాన్నా, అక్కడవుంటే అందరివంకా చూస్తూ వున్నట్టు వుంటుంధి....అక్కడే వుంచు నాన్నా."

పిల్ల మాటలకు రాజారావుకి కోపం వొచ్చింది. కోపానికి అలవాటుపడ్డవాడు కాదుగనుక కోపం విసుగ్గా పరిణమించింది. "నీకుతెలియదు తల్లీ, అమ్మకి ఇక్కడవుంటమే ఇష్టం" అన్నాడు.

"అదికాదు నాన్నా...."

"ఊరుకో అమ్మా, నన్ను విసిగించకు."

ఆ మాటలకు పిల్లకళ్ళల్లో నీళ్ళు తిరిగినై. రాజారావు తన కూతుర్ని ఎన్నడూ ఇట్లా విసుక్కుని ఎరగడు. ఆ పిల్లకు ఈ అనుభవం కొత్త. చాలా అభిమానపడ్డది. తండ్రిదగ్గర నుంచో టానికే కష్టంవేసింది. అడుగులో అడుగు వేసుకుంటూ కుటీరం లోనుంచి వెళ్ళిపోయింది.

రాజారావు విసుక్కున్నాడేగాని విసుక్కోగానే పశ్చాత్తాపపడ్డాడు. తనకూతురు కళ్ళల్లో నీళ్ళు తిరగటం చూశాడు. ఆతని గుండెలు అవిసినయి. తనభార్య పోయినప్పటి నుంచీ, కూతురే తన జీవితానికి ఆధారం. తనింకా బతుకుతున్నాడంటే అది ఈ కూతురువల్లే. అటువంటి తన కూతురుకూడా తనకు దూరం అవుతూవుంది. తను ఇదివరకు మనిషికాడా? తనస్వభావం మారిపోతూ వుందా ఏమిటి? కర్కశత్వం ఏర్పట్టంలేదుగద!

అతనికి ఏమీ తోచలేదు. తనభార్య ఫొటోవంకకు తిరిగి రెప్పవాల్చకుండా చూస్తూనుంచున్నాడు. కాని అతని మనస్సతని స్వాధీనంలో లేదు. పరిపరివిధాల పోతూవుంది. ఏకాగ్రతకి ప్రయత్నించాడు. తనభార్యమీద మనస్సుని నిలపటానికి ప్రయత్నించాడు. లాభంలేకపోయింది. ఆలోచనలమీద ఆలోచనలు వొస్తున్నాయి. రకరకాల ఆలోచనలు కలగాపులగం అవుతున్నై.

అన్నిట్లోకీ కనకాంబరం చీరె ప్రధానంగా కనబడుతూ వుంది.

"కనకాంబరం చీరె అంటే నాకు ఇష్టం"

"నువ్వు కట్టుకునేదానివి. అందుకని అమిత ఇష్టం."

"ఎవరు కట్టుకున్నా కనకాంబరం చీరె అందంగానేవుంటుంది"

కనకాంబరంచీరె కట్టుకున్నవాళ్ళంతా అందంగా నేవుంటారు."

"కిష్టుడిచెల్లెలు కనకాంబరంచీరె కట్టుకుంది. ఆ అందం కనకాంబరంచీరెదే. ఆమెదికాదు."

"నీ జ్ఞాపకార్థం నేను మనస్సులో దాచుకున్న చీరె ఆమె కట్టుకునేటప్పటికి నాకు కోపం వొచ్చింది."

ఆ అమ్మాయిమీద తనకు కోపం ఎందుకురావాలి? ఆ అమ్మాయి ఏమి తప్పుచేసింది? కనకాంబరంచీరె తనభార్య తప్ప ఇంకెవ్వరూ కట్టుకోగూడదా యేమిటి? కట్టుకుంటేమాత్రం ఏం, తన భార్యని జ్ఞాపకం చెయ్యటానికే సహాయపడుతుంది. ఆమె శరీరం పరిశుభ్రంగా ఉంచటానికి ప్రయత్నించింది. అందులో

తప్పేమి వుంది? ప్రతిదీ పరిశుభ్రంగా ఉంచటం తన భార్య క్కూడా చాలా ఇష్టం.

అయితే మరి కిష్టుడిచెల్లెలుమీద తనకు ఎందుకు కోపం వొచ్చింది?

అకస్మాత్తుగా రాజారావు మనస్సులో ఒక అనుమానం విరిసింది. తను పడిన విసుక్కి కారణం తనకొచ్చిన కోపమేనా, తనకొచ్చిన కోపానికి కారణం శాంత కుటీరంలో చేసిన మార్పులూ, ధరించిన కనకాంబరం చీరేనా? తనకు వొచ్చిన కోపానికి కారణం, నిజంగా కోపమేనా! లేకపోతే ఎందుకు? తన కంత కష్టంవేసింది? ఎందుకు తనకు అంతకోపం వొచ్చింది? ఎందుకు తానట్లా ప్రవర్తించాడు? ఈ ప్రశ్నలకు జవాబు అతని మనస్సులో చూచాయగా కనిపించింది. అదే కారణం అనుకో టానికి అతనికి భయంవేసింది. ఆ ప్రశ్నలకు జవాబులు వెతు క్కోటమే ఘోరపాపం అనుకున్నాడు అసలు ఆ ప్రశ్నలు కల గటమే హృదయదౌర్బల్యం అనుకున్నాడు తన భార్య ఫోటో మీద చూపునిలిపి "జీజీ—జీజీ?" అన్నాడు. అది తన్ను కాపాడమని ప్రార్థనా, గుండెలు పగిలిన గుర్తా? - "జీజీ,"

జీజీ అతని భార్యముద్దుపేరు. జీజీని పదేపదే స్మరిస్తూ కన్నీరు కారుస్తూ అక్కడే కూర్చున్నాడు, రాజారావు. కాని మనస్సుమాత్రం స్వాధీనం తప్పింది.



# 8

కుటీరంలోనుంచి వొచ్చినప్పటినుంచీ శాంత చాలా విచారంగావుంది. ఆమె మనస్సులో ఆందోళన ఎక్కువైంది. ఎంత అపుకుందామన్నా ఆగకుండా ప్రశ్నలమీద ప్రశ్నలు పుట్టు కొస్తున్నాయి తాను తోటలోకి వెళ్ళటం, కుటీరం ప్రవేశించటం, అంతా సర్దటం అన్నీ పొరపాట్లకిందే భావించుకొని పశ్చాత్తాప పడుతూవుంది.

ఈవిధంగా ఆమె తన్ను తాను ఎంతసేపూ విమర్శించు కోవటం, తన్నుతాను నిందించుకోవటం తప్ప ఆమెకు రాజారావు మీద కోపంరావేదు. ఎంతసేపూ 'ఆయనకు ఇష్టంలేనిపని నేను ఎందుకు చేశాను?' అనే బాధ పడుతూవుంది శాంత.

శాంతలో మార్పురాగానే మళ్ళీ ఇంటి వాతావరణం అంతా మారిపోయింది. ఆమె విచారం ఇంటిల్లపాదీ ప్రతిఫలిం చింది. అందర్లోకీ పిల్లలపని మరీ అన్యాయం అయిపోయింది. శాంత వొచ్చినదగ్గర్నుంచీ ఆమెనే అంటిపెట్టుకు వుంటంవల్ల ఆమె దగ్గరకు పిలవకపోయేసరికి, పిచ్చెత్తినట్టు ఆ గదిలోనుంచి ఈ గదిలోకీ ఈ గదిలోనుంచి ఆగదిలోకీ తిరగటం మొదలు పెట్టారు. ఏదో పోయిందానికోసం వెతుకుతున్నట్టు కనబడు తున్నారు. పసిపిల్లవాడు మరీ బెంగపెట్టుకున్నాడు.

రాజారావు కూతురు శాంతని పలకరించాలనీ, మాట్లా డించాలనీ ఒకటే ప్రయత్నం. కాలుకాలిన పిల్లికిమల్లే తిరుగుతూ వుంది. శాంతవున్న గదిముందునుంచి అటూఇటూ నాలుగయిదు సార్లు తిరిగింది. లోపల అలికిడికూడా లేదు. ఎవ్వరూ లేకుండా

చూసి తొంగి చూసింది. మంచంమీద గోడవైపుకి తిరిగి, శాంత పడుకొని వుంది.

ఆపిల్ల ధైర్యం తెచ్చుకొని గదిలోకి వెళ్ళింది. శాంతే ముందు పలకరిస్తుందేమో అని చూసింది ఆమెకు తాను వొచ్చి నట్టు తెలియచెయ్యటానికి కాసేపు గదిఅంతా తిర్గాడింది. సడీ చప్పుడూ చేసింది. "పాడుఎలుకలు; ఏవీ బతకనివ్వవు!" అని బిగ్గరగా శాంతకు వినపడేటట్టు అంది.

శాంత మాట్లాడలేదు. ఆమెమనస్సు అక్కడ లేకపోవ టమే దానికి కారణం. ఇది లాభంతీసుకొని పిల్ల నెమ్మదిగా మంచంఎక్కి శాంత కాళ్ళదగ్గర కూర్చొని బిగ్గరగా స్వగతం మొదలుపెట్టింది—"ఏం? అసలు మనం తోటలోకి వెళ్ళేవొద్దు. ఇంతపూట వుంటే పువ్వులకే కరువు అవుతుందా? కామాక్షమ్మ గారిఇంటికి వెళ్తే కావలసినన్ని పువ్వులు పెడతారు. ఆ పువ్వులు దండగా గుచ్చి అమ్మమెళ్ళో వేద్దాం. అసలు మనం కుటీరంలోకి వెళ్ళకపోతే మనకు జరగనిది ఏమిటి? మనం ఎక్కడికీ వెళ్ళొద్దు- ఇక్కడే వుందాం."

పిల్ల కాళ్ళదగ్గర కూచోగానే శాంత గ్రహించింది. ఆపిల్ల మాటలు వినేటప్పటికి ఆమెకు దుఃఖం ఎక్కువైంది. ఆ పిల్లకు తనంటే ఎంతప్రేమ? తనవిచారం పోగొట్టటానికి ఎంత ప్రయ త్నిస్తూవుంది?!....

శాంత దుఃఖంమింగి, "ఏవమ్మా, పడుకుంటావా?" అని అడిగింది.

ఆ ప్రశ్నకు పిల్లమొహం వికసించింది. పిన్ని మాట్లా డింది. తన ప్రయత్నం ఫలించింది. ఆ పిల్లకి ఇంకేంకావాలి?

శాంత ఏమీ మాట్లాడలేదు. తలవొంచుకొని, భూమిలోకి చూస్తూ కూర్చుంది. కాని అక్క చెపుతున్న ప్రతిమాటా ఆమె అత్యంతశ్రద్ధగా వింటూవుంది.

అక్క చిక్కుతియ్యటం పూర్తిచేసి, దువ్వెన పక్కనపెట్టి జడవేస్తూ మళ్ళీ సంభాషణ అందుకుంది—"నాకు మొదట్లో చాలాభయంవేసింది. నెమ్మదిమీద ఆయనగారి స్వభావం అర్థం అయింది. ఇక యిప్పుడు ఏంచేస్తానో తెలుసా శాంతా? మీ అన్నయ్యగారు ఎప్పుడు కసురుకుంటారా అని కాచుక్కూచుంటాను. ఎందుకో తెలుసటే: కసురుకోగానే పశ్చాత్తాపపడి ఎంత బాగుంటారనుకున్నావు: 'ఏమే, నామాటవినవే: ఒక్కసారి ఇటు చూడవే? నిన్ను కసురుకోకపోతే, ఎవర్ని కసురుకోమంటావే?' అంటూ తిరుగుతారే"

అక్క ఈవిషయం తనకు ఎందుకు చెపుతూవుందో శాంత గ్రహించింది. ఆమెకళ్ళల్లో నీళ్ళుతిరిగినై. శాంత తనభావం గ్రహించిందని శరీరస్పర్శతోనే అక్క గ్రహించింది.

కసురుకోవటం చాతగానివాళ్ళకి ప్రేమించటం ఏంచాతవుతుందే? ఇప్పుడు తమ్ముడు వున్నాడనుకో"....అని ఏమో చెప్పబోయింది అక్క.

శాంత ఇక భరించలేకపోయింది. లోలోపల పెనవేసుకుంటున్న దుఃఖం కట్టలుతెంచుకుంది. అక్కవొళ్ళో తలపెట్టుకొని ఎక్కెక్కి ఏడువసాగింది. అక్కకూడా కన్నీరు ఆపుకోలేకపోయింది. ఆమె మాతృహృదయం కరిగి నీరయింది.

"వూరుకో అమ్మా, నీకు తెలియదు....చిన్నదానవు....పిన్నిమాట వినవూ?....ఎందుకే అంత ఏడుపూ?....అంతా మన

మంచికే జరుగుతుందే పిచ్చిదానా," అని ఓదార్చింది. కాని లోలోపల ఈ లేతహృదయంతో జీవితం నిర్దాక్షిణ్యంగా ఆడటం మొదలుపెట్టిందని విచారించింది.

శాంత కన్నీరు తుడుచుకొని, "పిన్నీ నిన్నుఒకటి అడుగుదాం అనుకుంటున్నాను. నిజంచెపుతావా?" అని అడిగింది.

"అడుగమ్మా, అట్లాగే అడుగు...."

"నేను చేసిందాంట్లో ఏమన్నా తప్పువుందాపిన్నీ?"

"వెర్రిపిల్లా:" అని అక్క శాంతని ప్రేమపూర్వకంగా కావిలించుకొని, "తప్పేముందే: పిల్లల్ని కన్నతల్లి ఎవతె అనగలుగుతుందే ఆమాట?" అంది.



అక్కమాటలతో శాంతమనస్సులోని ఆందోళన కొంచం తగ్గింది. కాని, బాధపడ్డం నేర్చుకోవటంవల్ల ఆమెలో చాలా మార్పు వొచ్చింది. హృదయం మెత్తబడింది. ఆలోచన ఎక్కువైంది. మాటలో, చూపులో, చేతులో, గాంభీర్యం, ఆదరణా, ప్రేమా ఉట్టిపడుతున్నయి.

శాంతలో ఈమార్పు వొచ్చేటప్పటికి అక్కదృష్టిమారింది. ఆమెని చిన్నపిల్లని చూచినట్టు చూడకుండా, ప్రతిచిన్నపనికీ ఆమెసలహా అడిగటం మొదలుపెట్టింది.

గతరాత్రి రాజారావు భోజనానికి రాలేదు. ఒక్కొక్క పూట భోజనానికి రాకుండావుంటం అతనికి అలవాటు అవటం వల్ల ఎవ్వరూ ఆవిషయం ఎక్కువ పట్టించుకోలేదు. కానిమర్నా

డు ఉదయంకూడా రాకపోయేటప్పటికి అక్క కోడిన్ని కుటీరానికి వెళ్ళి తమ్ముణ్ణి పిలుచుకురమ్మని పంపింది.

ఆపిల్ల తండ్రిదగ్గరకు వెళ్ళటానికి కొంచం తటపటాయించింది. తనకు కుటీరంలో జరిగిన పరాభవం ఆపిల్లఇంకా మరచిపోలేదు. తండ్రే తన్ని ముందుపలకరించాలని ఆపిల్ల పట్టుదలకి అంతకంటే పెద్దవాంఛ ఏమీలేదు. కాని, "రాత్రి నాన్న భోజనం చెయ్యలేదు: ఇవాళ ఇంకా రాలేదు." అని చెప్పేటప్పటికి అపిల్ల తనకు జరిగిన పరాభవం మరచిపోయి తోటలోకి పరిగెత్తింది.

రాజారావు తోటలో లేడు. కుటీరంలో లేడు. గంగాస్రవంతివొడ్డున లేడు. కూతురు అతనికోసం వెతికి వొచ్చి, "నాన్న ఎక్కడా కనపడలేదు, అత్తయ్యా" అని అక్కతో చెప్పింది.

అక్కడే వున్న శాంతకి భయం వేసింది. గుండె గుభేలుమన్నది. ఇంతవరకు, భార్య పోయినప్పటినుంచీ, రాజారావు ఆ పరిసర ప్రాంతాల్లోనుంచి బయటకు అడుగుపెట్టి ఎరగడు. తోటనీ కుటీరాన్నీ, గంగాస్రవంతినీ విడిచిపెట్టి ఎరగడు. ఇప్పుడేంజరిగింది? ఎక్కడకు వెళ్లాడు? ఎందుకు వెళ్ళాడు?

శాంత రాజారావును గురించి ఎప్పుడు ఊహించుకున్నా, కుటీరంతోనో, పూలమొక్కలతోనో, గంగాస్రవంతితోనో కలిపి వూహించుకునేది. 'పూలమొక్కలమధ్య ఇట్లా నుంచొని వుంటారు; అక్కఫొటోముందు ఇట్లాకూర్చొని వుంటారు; గంగాస్రవంతి వొడ్డున యిసుక పొరల్లో ఇట్లా పడుకొని వుంటారు:' అని వూహించుకుంటూ వుండేది.

ఇప్పుడు వాటికి సంబంధం లేకుండా రాజారావుని ఊహించుకోవటం ఆమెను బాధపెట్టింది. గంగాస్రవంతి ఇసుక

పొరలూ, తోటలోని పూలమొక్కలూ, కుటీరంలోని అక్కఫొటో ఆయన్ని ఎప్పుడూ వెయ్యికళ్ళతో కనిపెట్టి వుండేవి. ఇప్పు డాయన వీటిని విడిచిపెట్టి వెళ్ళారు. ఎక్కడికి వెళ్లారు? ఆయన మంచి చెడ్డలు ఎవరు చూస్తారు? ఆయన్ని ఎవరు కనిపెట్టి వుంటారు? ఎన్నడూలేంది ఇవ్వాళ్ళ ఎందుకు వెళ్ళారు? తన స్నేహితులను ఎందు వొదిలిపెట్టి వెళ్ళారు? ఈ ప్రశ్నలకు ప్రత్యుత్తరంగా. కుటీరంలో జరిగిందానికీ. రాజారావు ప్రవర్త నకూ సంబంధం వుందని ఆమె హృదయం గోలచేసింది. తన ప్రవర్తనే రాజారావుని బయటకు పంపిందని ఆమె వూహించు కుంది కుటీరంలో తాను చేసిన మార్పు అంతటితో ఆగనందుకు విచారపడింది. పోనీ ఇంతటితో నైనా ఆగుతుందా?

"పిన్నీ బావ ఎప్పుడూ తోట విడిచిపెట్టి వెళ్ళలేదు కాదూ?" అని అడిగింది.

"మరదలు పోయింతర్వాత వెళ్ళలేదమ్మా-ఇదే మొదలు." అంది అత్త. ఆమె మాట్లాడకుండా కూచున్నా. శాంత హృద యంలో జరుగుతున్న కల్లోలం గమనిస్తూనే వుంది.

"బజార్లల్లో వొచ్చేపోయే కార్లూ, బళ్ళూ, జనం - అంతా గజిబిజిగా వుంటుంది కాదూ?"

"అవునమ్మా, మరీ పెద్దబజార్లు రెండూ ఎప్పుడూ కిట కిటలాడుతూ వుంటాయ్"

"పిన్నీ, బావ ఎప్పుడూ పరధ్యానంగా వుంటాడుకాదూ?"

"అవునమ్మా! నువ్వు చూస్తూనే వున్నావుగా! తనముందు ఏం జరుగుతూవుందోకూడా తమ్ముడు గమనించటం లేదు...."

"బావ పెద్దబజారే వెళ్ళాడేమో!" అందిశాంత. అక్కతో

చెప్పినట్లు కాకుండా తనలో తనే అనుకున్నట్లు అనుకుంది. ఈ అనుమానం అక్కముందు వెళ్లబుచ్చాలని ఆమెకు లేదు. తనకు తెలియకుండానే ఈ అనుమానం ఆమె హృదయంలో పుట్టింది. తనకు తెలియకుండానే మాటలను తెచ్చుకుంది. తనకు తెలియకుండానే బయటపడింది.

ఈ అనుమానంతో ఆందోళన ఎక్కువైంది. ఆమె మనస్సుగజిబిజి అయింది. ఆ రెండు పెద్ద బజార్లూ రెండు పెద్ద తాచుపాములకుమల్లే ఆమెకు కనిపించినయి. పడగలువిప్పి ఆడుతున్నయి. బుసలు కొడుతున్నయి. వొచ్చేపొయ్యే వాళ్ళని విడవకుండా కాట్లువేస్తున్నయి. ప్రేమ కీడుని శంకిస్తుంది.

ఆ బజార్లల్లో అసలు వుండే సమ్మర్దనకు వెయ్యిరెట్లు ఎక్కువ వూహించుకుంది శాంత. అసలు ఆ జజార్లల్లో తిరిగే కార్లకు వేయిరెట్లు ఎక్కువ వూహించుకుంది. జనానికి వేయిరెట్ల జనాన్ని వూహించుకుంది. బళ్ళకి వేయిరెట్లు బళ్లని వూహించుకుంది. పోట్ల ఎద్దులు వుంటయి. తనవూళ్ళో ఒకఆబోతువుంది. కనపడ్డవాళ్లనల్లా పొడవటమే దాని పని. తనబావకి పరధ్యానం ఎక్కువ. తనబావ పరధ్యానాన్ని వెయ్యిరెట్లు ఎక్కువ వూహించుకుంది. అపాయాన్ని లక్షరెట్లు ఎక్కువ ఊహించుకుంది.

"పిన్నీ!" అంది. అది అంటంకాదు, ప్రశ్నించటం కాదు, ఆశ్చర్యపడటంకాదు, విచారపడటం కాదు, దుఃఖించటం కాదు, ఆక్రోశించటంకాదు-దానికి మాటలేదు.

"పిన్నీ" "పిన్నీ" "పిన్నీ"—ప్రపంచంఅంతా తన్ను 'పిన్నీ' అనిపిలుస్తున్నట్టు వినిపించింది అక్కకి. ప్రపంచాన్నంతా తనఅంకంలోకి తీసుకోవాలనిపించింది అక్కకి. తనుఅక్క-తను

పిన్ని-తనుఅత్త—తను అమ్మ—అన్నీ తనే అనిపించింది ఆమెకు. ఆమెకు తన అంతఃకరణమే ఈ ప్రపంచం, ఈ ప్రపంచమే తన అంతఃకరణం అనిపించింది.

ఏకధారగా కన్నీరు కారుస్తూ నుంచున్న శాంతని తన పొత్తిలోకి తీసుకుంది. తల నిమురుతూ, "పిచ్చిదానా, ఎందుకే మనస్సుని అంత బాధపెట్టుకుంటావు?" అంది.

"బావ బయటకు వెళ్లటానికి నేనే కారణం పిన్నీ—ఏం జరిగినా, కారణం నేనే," అంది శాంత ఎక్కెక్కి ఏడుస్తూ. అక్క ఎన్నిచెప్పినా ఈభావం ఆమెని విడిచి పెట్టటంలేదు. ఇంతవరకు ఆపిల్ల ఎవరితో ఏపని చేయించటానికీ కారకురాలు అవలేదు. అందుకని ఆమెను ఈభావం పట్టుకొని పీడింస్తూవుంది.

"అవునే నువ్వే కారణం" అని జవాబు చెప్పింది అక్క. "దీని ఒక్కదానికే కాదే! జరగబోయే మంచికంతకీ నువ్వే కారణం. నువ్వు కారణం అవ్వాలనే నాకోరిక కూడాను, కిష్టుడు వెళ్తూ వెళ్తూ తమ్ముడికి ఏం సలహా చెప్పాడో నువ్వు వినలేదటే! ఈ కుటీరాన్నీ, ఈతోటనీ, ఈ గంగాప్రవంతినీ విడిచిపెట్టిఒక్క నెలరోజులు ఎక్కడన్నా తిరిగి రమ్మన్నాడు. తమ్ముడు ఇప్పుడు ఆ పనే చేస్తున్నాడు. ఇందుకు నువ్వు కారణం అవటంకంటే ఇంకేం కావాలే శాంతా?" అని అడిగింది అక్క.

"బావ బయటకు వెళ్లాడంటే ఎందుకో భయంగా వుంది. పిన్నీ!" అంది శాంత అక్కశరీరస్పర్శవల్లా, మాటలవలా ఆమె కొంచం శాంతించింది.

"భయం ఎందుకే? తమ్ముడు ఎందుకు బయటకు వెళ్ళి వుంటాడో ఆలోచించావా?

తమ్ముడి దృష్టి మారి వుంటుంది. ఇంతవరకు తనకు ఆనందాన్నీ తృప్తినీ ఇచ్చినతోటా, కుటీరం, గంగాప్రవంతీ ఇప్పుడు ఇవ్వలేకపోయి వుంటయి, దాన్తో తమ్ముడు ఆపరిసరాల్లో వుండలేకపోయి వుంటాడు. అందుకని వాటిని విడిచి బయటకు వెళ్లాడు.

తమ్ముడికి ఆందోళన ఎక్కువై వుంటుంది, శాంతా! తమ్ముడికీ తమ్ముడి అంతర్యానికీ సంఘర్షణ బయల్దేరి వుంటుంది మార్పుకి ఇది ముఖ్యలక్షణమే! తమ్ముడు మారుతున్నాడే శాంతా! అంతకంటే మనకు ఇంకేంకావాలే?"

అక్క చాలా వుత్సాహంగా మాట్లాడింది. ఆమె అంత ఉత్సాహంగా మాట్లాట్టం శాంత ఎన్నడూ చూచివుండలేదు. ఆవేశంతో ఒకటి రెండుసార్లు మాటలు తడబడినై. పెదవి వొణికింది. కళ్లు మెరిసినై.

కాని అక్కకి మనస్సులో భయంగానే వుంది—ఈఅగ్ని పరీక్షలో తమ్ముడు ఎటు మొగ్గుతాడో అని? పైకి శాంతకి చెప్పిందిగాని మనస్సులో అక్కకి తెలుసు- ఈ సంఘర్షణపర్యవసానం ఎటైనా అవ్వొచ్చని - ఏక్షణం ఏంజరిగినా జరగొచ్చని.



ఆరోజంతా శాంత రాజారావుకోసం ఎదురు చూస్తూనే వుంది. చీమ చిటుక్కుమంటే అతడేమోనని వాకిలివైపుకి చూసేది.

బయట అడుగులచప్పుడు వినపడ్డట్టు వుండేది. వాకిలి దగ్గర ఆగినట్లు వుండేది. శాంత అతడే అనుకునేది. కాని, ఎంత సేపు చూసినా ఎవ్వరూ లోపలకు వొచ్చేవారు కాదు.

అయిదు నిమిషాల్లో తప్పకుండా వొస్తాడనుకునేది. గడి యారం చూస్తూ కూర్చునేది. ఎంతసేపటికోగాని అయిదు నిమి షాలయ్యేది కాదు. కాలం త్వరగా గడిచినట్టు వుంటుందని కళ్ళు మూసుకునేది. అయిదు నిమిషాలు దాటి పదినిమిషాలైనా అతడు రాలేదు.

పసిపిల్లవాడు దేవుడితో సమానం. పసిపిల్లలు ఏదిచెపితే అది అవుతుంది. అందుకని పిల్లవాడికి వేళ్ళు చూపించి పట్టుకో మనేది. ఒకవేలు పట్టుకుంటే బావ వొస్తాడు. ఒకవేలు పట్టు కుంటే రాడు.

"చూడు బాబూ....ఇటుచూడు, నీకు ఏవేలు కావాలి?"

పిల్లవాడికి ఏవేలూ అక్కర్లేదు. ఆమె జుట్టుకావాలి. ఎగిరి జుట్టుపట్టుకొని నవ్వేవాడు.

పిల్లవాణ్ణి ఆమె బతిమాలేది. "మాబాబుకాదూ....నామాట వినవూ?" పిల్లవాడు తడవకి ఒకవేలు పట్టుకునేవాడు. వొస్తాడను కున్నవేలు పట్టుకునేవరకు చూపించేది.

పిల్లవాడు, రాడు అనుకున్నవేలు పట్టుకుంటే ఆమెగుండె గుభేలు మనేది. భయంతో కంపించి పోయేది. "పసివాడు, వాడికేంతెలుసు?" అనుకొని సమాధానపడేది. వొస్తాడనుకున్న వేలువాడికి అందించేది. వాడు వొస్తాడనుకున్నవేలు పట్టుకునే వాడు. ఆమె మొఖం సంతోషంతో విప్పారేది. "మాబాబే!" అని ఎత్తుకొని ముద్దులాడేది.

కాని అతడు రాలేదు.

ఆమె మనస్సు ఆగటంలేదు. తొక్కిసలాడుతూ వుంది. ఊహలు చెలరేగినై. అకస్మాత్తుగా కుటీరానికి వొచ్చాడేమో

అనే అనుమానం కలిగింది. కాని ఎలా తెలుసుకోవటం? తప్ప కుండా వొచ్చివుంటాడు అనుకుంది. కాని తెలుసుకోకుండా ఉండ లేకపోయింది. పిల్లదగ్గరకు వెళ్ళి "ఏం అమ్మా....నాన్న తోట లోకి వచ్చారేమో?" అంది.

"నాకు తెలియదు పిన్నీ"

"చూచివొస్తావా?" అని అడిగింది.

పిల్ల ఆమెని తేరిపార చూచింది. ఏమనుకుందోగాని "అట్లాగేపిన్నీ" అనివెళ్ళింది.

పిల్లకోసం నిరీక్షిస్తూవుంది శాంత. పిల్ల ఎంతసేపటికీరాదే: ఇంత ఆలస్యం చేస్తుందే? తండ్రి వొచ్చివుంటాడు. తండ్రితో మాట్లాడుతూ వుండివుంటుంది. ఇంకా రాదేం? ఆగలేక వాకిలి దాకా వెళ్ళింది.

పిల్ల వొస్తూవుంది. ఆ పిల్లని చూచి అతడు వొచ్చాడో లేదో వూహించుకోటానికి ప్రయత్నించింది. వొచ్చే వుంటాడు అనుకుంది. లేకపోతే ఆ పిల్ల అట్లా ఎందుకు నడుస్తుంది? మరు క్షణం అతడు రాలేదు అనుకుంది. తండ్రివొచ్చివుంటే ఆ పిల్ల పరిగెత్తుకుంటూ రాకపోయిందా? అనుకుంది.

పిల్ల శాంత దగ్గరకు వొచ్చింది. ఏమి చెపుతుందో అని శాంతకి భయం వేసింది. ఆ పిల్లవంకకి చూడలేక పోయింది. ఇంట్లోకి అడుగువేసింది.

"ఇంకా రాలేదు పిన్నీ:" అంది పిల్ల.

"రాలా?" ఇక మాటలు రాలేదు శాంత నోటినుంచి.

"రాలేదు పిన్నీ....అన్నీ తిరిగి చూశాను. గంగా స్రవంతి...."

మిగిలిన మాటలు ఆమెను వినిపించనేను.

ఆ రాత్రి శాంతకి సరిగ్గా నిద్రపట్టలేదు. కన్ను మూస్తే పిచ్చిపిచ్చి బొమ్మలు కనిపించేవి. అర్ధరాత్రి పీడకల వొచ్చింది. రెండుకార్లు వాయువేగంతో ఎదురు బదురుగా వొస్తున్నాయి. బావ వాటిమధ్యగుండా పరధ్యానంగా వెళ్తున్నాడు. భయంతో ఆమె గుండెలు దడదడ కొట్టుకున్నాయి. "బావా!" అని కేక వేసింది. అతన్ని రక్షించటానికి రెండుకార్ల మధ్యకి పరిగెత్తింది. ఆ కార్లు రెండూ ఢీకొన్నాయి.

"బావా!" అని కేకవేస్తూ ఆమె పక్కమీదనుంచి తుళ్ళి పడి లేచింది ఇక ఆమెకు నిద్ర పట్టలేదు. అలాగే తెల్లవార్లూ కన్నీరు కారుస్తూ కూర్చుంది.

## 9

రాజారావు మనస్సు పూర్తిగా చెడింది. ఇంతకుముందు అతని భావాలకూ, ప్రకృతికీ భిన్నత్వం వుండేదికాదు. ప్రకృతి అతని భావాలకు దోహదం ఇస్తూవుండేది.

ఇప్పుడాస్థితి మారింది.

ఇంతకుముందు అతడా పరిసరాల్లో వుంటే ఇంకొక విష యం జ్ఞాపకం వొచ్చేదికాదు. అనుక్షణం తన్మయత్వంలో వున్నట్లు వుండేది. తనభార్య వున్నట్లే వుండేది. ప్రతి వస్తువు

లోనూ, ప్రతి కదలికలోనూ, ప్రతి శబ్దంలోనూ తనభార్యే కనిపించేది-- వినిపించేది. నిత్యం అతనిహృదయం జీజీ నిరంతర స్మరణతో నిండివుండేది. అతనిచూపుల్లో జీజీ స్వరూపం తాండవం ఆడుతూవుండేది. ఇప్పుడాస్థితి మారింది.

అతని కళ్ళల్లో మెలిగే జీజీస్వరూపం, పిలిస్తే పలికే జీజీ ఆకారం ఇప్పుడు చెదిరింది. జీజీతోపాటు తాను కుటీరంలో చూసిన దృశ్యం, కనకాంబరంచీరే, శాంతరూపం కనిపిస్తున్నాయి.

ఒక్క తృటిలో అతని బతుకంతా గందరగోళం అయిపోయింది. ఏకలక్ష్యంతో జీవితం గడుపుతున్న అతనికి ఆ లక్ష్యాన్నుంచి కన్ను చెదిరేటప్పటికి అంతా శూన్యం అయింది. తన భార్యకోసం బతుకుతున్నాననే తృప్తి, తనభార్య తనలోనే వుందనుకోవటంలో వున్న ఆనందం, ఇప్పుడతనికి లేకుండా పోయినయి.

ఇప్పటిదాకా అతను 'ఊహ' అనే కుంచెతో తన పరిసరాలకు అనేక రంగులు వేసుకొని తృప్తిపడ్డాడు. ఇప్పుడు ఆ కుంచే పాడైపోయింది. కుంచె మూలపడేటప్పటికి రంగులు అంతర్థానం అయి, వాస్తవికజగత్తు వాస్తవికజగత్తుగా కనిపించటం మొదలుపెట్టింది: గంగాస్రవంతి గంగాస్రవంతిగా కనిపించింది: పూలమొక్కలు పూలమొక్కలుగానే కనిపించినై: కుటీరం కుటీరంగానే కనిపించింది.

ఈ మార్పుతో అతని విచారం ఇదివరకంటే వెయ్యిరెట్లు ఎక్కువ అయింది. తన విచారంచుట్టూ తాను కట్టుకున్న ఆనందమందిరం భగ్నం అయింది. ఒకప్పుడు తనకు శాంతిని ఇచ్చినవన్నీ ఇప్పుడు బాధపెడుతున్నాయి. ఆబాధ అతడుభరించ

లేకపోయాడు. తన ప్రియపరిసరాలను వొదిలిపెట్టి బయటకు వెళ్ళాడు. తనభార్య పోయిందిమొదలు ఆ తోటా, గంగాస్రవంతే అతనికి లోకం. ఇప్పుడు ఆ గిరి దాటి వాస్తవలోకంలో అడుగు పెట్టాడు....

శాంత అనుమానించిన వీధికే వెళ్ళాడు. నిజంగా ఆ వీధి కోలాహలంగా వుంది. వొచ్చేపోయే జనం, బళ్ళూ, కార్లూ— చాలా హడావడిగా వుంది. అతనికళ్ళు మిరుమిట్లు కొలిపినై అంతా కొత్తగా విచిత్రంగా కనిపించింది. ఎటుపోవాలో, ఏం చెయ్యాలో అతనికి తోచలేదు. ఏకాంతవాసం అతన్ని మానవ సంఘానికి దూరంచేసింది. అతనికి తెలిసో తెలియకో, సంఘాన్ని బహిష్కరించాడు. సంఘం తెలిసి తెలిసి అతన్ని బహిష్కరించింది.

హడావడిగా సాగిపోతున్న సంఘాన్ని విచిత్రంగా చూస్తూ, దాని అంచున నిలబడ్డాడు రాజారావు. జనం ఎవరి పనులమీద వాళ్ళున్నారు. ఎక్కడ క్షణం వృధాఅవుతుందో అని ఆతురత పడుతున్నారు. రకరకాల మనుష్యులు, రకరకాల స్వరూపాలు, రకరకాల ప్రవర్తనలు - వీళ్ళందర్నీ కూడకట్టుకొని సంఘం ముందుకు వెళ్ళుతూ వుంది.

ఆ జనాన్ని, ఆసందడిని చూసేటప్పటికి రాజారావుకి తన ఒంటరితనం భరించలేందిగా తోచింది.

ఆ వరసగావున్న భవనాలూ, సోలుపున వెళ్తున్న బళ్ళూ, ఒకచోటే దగ్గరదగ్గరగా పెరిగినచెట్లూ—అన్నీ అతనికి తన ఒంటరితనాన్నే జ్ఞాపకం చేసినయి.

ఒంటరితనం ఎంత దుర్భరమైందో అప్పుడు అతనికి

తెలిసింది. ఒంటరితనం మానవస్వభావాన్నే మార్చివేస్తుంది. నిరాశనీ నిస్పృహనీ ఎక్కువ చేస్తుంది. మానవుని హృదయాన్ని చీకాకు పరుస్తుంది. తనమీదతనకే ఏవగింపు కలిగిస్తుంది. మానవకోటిమీద ఈర్ష్యను రేపుతుంది.

రాజారావుఅక్కడ ఒక్కక్షణంకూడా వుండలేకపోయాడు. ఆ సందడిని భరించలేకపోయాడు. తన ఒంటరితనాన్ని తానే మోసుకుంటూ బయల్దేరాడు.

నడుస్తుంటే తననడక తనకే కొత్తగావుంది. అంతాతేలిగ్గా హుషారుగా నడుస్తున్నారు. నడక అంటే అడుగు తీసి అడుగు వెయ్యటం అనిగానీ, అడుగు ఎప్పుడూ ముందుకే వెయ్యాలని గానీ, ఒకపాదం భూమిని ఆనీఆనగానే రెండోపాదం పైకి లేవాలనిగానీ, వాళ్ళు ఆలోచించటం లేదు. కాని నడవటం అంటే తనకు.ఎంతబాధ! అడుగుతీసి అడుగు పెట్టేవరకూ తనకాలు పడే యాతనా, తిరిగే వంకలూ, అన్నీ తన గమనంలోనే వుంటయి.

రాజారావు ఆ వీధిమలుపు తిరిగాడు, తనకు తెలియకుండానే తిరిగాడు. ఎదురుగుండా ఒక పెద్ద ఊరేగింపు వొస్తూవుంది. ఊరేగింపుముందు ఇద్దరు స్త్రీలు జెండాలు పట్టుకొని నడుస్తున్నారు.

ఒక స్త్రీ పాడుతూవుంది:

ఆకలితోటీ
నకనకలాడే
అనాథ లంతా
లేవండోయ్

రెండో స్త్రీ పాడుతూ వుంది:

తిండికిలేకా
మలమల మాడే
దరిద్రులంతా
రారండోయ్

జనం అందుకుంది:

లేవరా, సోదరా
లేచి పోట్లాడరా
నీ హక్కుకోసమై
నీ భుక్తికోసమై.

పిల్లలు బిలబిలా పరుగెత్తుకుంటూ ఊరేగింపుతో కలుస్తున్నారు. పిల్లలూ, పెద్దలూ, పురుషులూ, స్త్రీలూ అన్నిరకాల ప్రజలూ వున్నారు ఆ ఊరేగింపులో. అందరి ముఖాలూ ఆనందంతో కళకళ లాడుతున్నాయి.

ఇంత ఆనందం వీళ్లకు ఎట్లావొచ్చింది? ఇంతమంది దేనికోసం కలిసారు? ఇంతమంది కలిసి దేనికోసం ఆనంద పడుతున్నారు? రాజారావు ఆ వేడిని తట్టుకోలేక పోయాడు. గిరుక్కున పక్కవీధిలోకి మళ్ళాడు.

గబగబా నడిచి వెళ్తున్నాడు. ఎదురుగుండా ఒక కారు వొస్తూవుంది. అతడు చూడలేదు. కారు శరవేగంతో వొస్తూ వుంది. అతడు గమనించలేదు. కారు దగ్గరకు వొచ్చింది. అతడు తొలగలేదు. కారే బర్రున తప్పుకు వెళ్ళింది.

అతడు అట్లాగే వెళ్తున్నాడు. ఎక్కడికో తెలియదు. వెళ్ళి వెళ్ళి ఒకచోట ఆగాడు. ఆగి ఎందుకు ఆగానో అని అటూ

ఇటూ చూశాడు. పక్కన పూల అంగడి కనిపించింది. అప్పు డతనికి ఎందుకు ఆగిందీ తెలిసింది. తనూ తన భార్యా రోజూ ఆ వీధికి వొస్తుండేవాళ్ళు. ఆ అంగడిలో పువ్వులు కొంటూ వుండేవాళ్ళు.

ఆ అంగడి చూసేటప్పటికి రాజారావుకి ప్రాణం లేచి వొచ్చింది. పువ్వులు కొందామని గబగబా అంగడిదగ్గరకు వెళ్లాడు. కనకాంబరందండ చేత్తో తీసుకున్నాడు. ఒక్కక్షణం అలాగే నిలబడిపోయాడు.

ఎవరికి? ఎవరికీ పువ్వులు ? ఎవరికీ దండ?

అతని చేతులు వొణికినై. కళ్లు చెమ్మగిల్లినై.

ఎవరికి ? ఎవరికోసం? ఎవరికివ్వను? చేతిలోని దండ అక్కడే జారవిడిచి మళ్ళీ బయలుదేరాడు.

"ఏం బాబూ, కొనకుండా వెళ్తారే?" అని అడిగాడు అంగడివాడు.

రాజారావునోట మాటరాలేదు. ఏమని చెపుతాడు? విన నట్టు నటిస్తూ కన్నీరు పెట్టుకుంటూ విసురుగా నడిచాడు.

ఊరంతా తిరిగాడు. సందుగొందు లన్నీ తిరిగాడు. సాయంకాలంవరకూ తిరుగు తూనే వున్నాడు. డస్సి కాళ్ళు మెత్త పడినై. అయినా అట్లాగే తిరుగుతున్నాడు. పక్కఇంటిమూరులో నుంచి ఒకపిల్లి ఎగిరిదూకి అతని ముందునుంచి పరిగెత్తింది.

ఆ పిల్లి పరిగెత్తటం చూసేటప్పటికి అకస్మాత్తుగా అతని కొక అనుమానంకలిగింది. తనూ దేన్నుంచో పరిగెత్తుతున్నాడు. దేన్నుంచో తప్పించుకోటానికి ప్రయత్నిస్తున్నాడు. దేన్నుంచో పారిపోతున్నాడు.

"దేన్నుంచి?" ఆలోచిస్తూ తప్పటడుగులు వేసుకుంటూ నడుస్తున్నాడు రాజారావు—"దేన్నుంచి?"

"జనాన్నుంచి," అని సమాధానం చెప్పుకున్నాడు.

"కాదు," అంది అంతర్వాణి.

"జెండాలనుంచి," అని సమాధానం చెప్పుకున్నాడు.

"కాదు," అంది అంతర్వాణి.

"పూల అంగడినుంచి" అని సమాధానం చెప్పుకున్నాడు.

"కాదు" అంది అంతర్వాణి.

"మరి దేన్నుంచి?" అని అడిగాడు.

"జీవితాన్నుంచి,"అని సమాధానం చెప్పింది అంతర్వాణి.

రాజారావుకి ఇక ముందుకి అడుగు పడలేదు. అలాగే నిలబడి పోయాడు. కాళ్ళు నిలవలేక పోయినయి. కూర్చొబడ్డాడు.

తను సంఘానికి పనికిరాకుండా పోయాడు. కుటుంబానికి పనికిరాకుండా పోయాడు. జీవితాన్నుంచి పారిపోతున్నాడు.

ఇన్నాళ్ళనుంచీ తాను చేస్తున్నపని ఇదేనా? జీవితాన్నుంచి పారిపోవటమేనా?

అతని కళ్ళు బయర్లు కమ్మినయి.



# 10

రాజారావు అర్ధరాత్రికి కుటీరం చేరుకున్నాడు. మనిషి తూలిపోతున్నాడు. అవయవా లేవీ అతని స్వాధీనంలో వున్నట్లు లేవు చేతులు తోటకూరకాడలకుమల్లే వేళ్ళాడుతున్నాయి. కీళ్లు పట్టుతప్పినయి. కాళ్ళునిలవక అడుగడుక్కీ మోకాళ్ళదగ్గర వొంగుతున్నాయి అతడు స్పృహలో వున్నట్టే లేడు.

తోటలోని పూలమొక్కలు వూరేగింపులోని మనుష్యుల తలలకుమల్లే కనిపించినయి. నిటారుగా వున్న అశోకచెట్లు పుట్ట గొడుగులకుమల్లే కనిపించినయి.

కుటీరంలో దీపం వెలుగుతూ వుంది. అది అతనికి శివుని మూడోకంటికిమల్లే కనిపించింది. దానివెలుగుని అతడు భరించ లేకపోయాడు. దీపం ఆర్పి పక్కమీద పడుకున్నాడు.

నిద్ర పట్టటంలేదు. మగతగా వుంది. ఆలోచనలు వొస్తు న్నాయి. కాని తాను ఆలోచిస్తున్నట్టుగా లేదు.

కళ్ళముందు నల్లని ఆకాశం కనిపించింది—కారునలుపు. ఆ ఆకాశంలో ఒకపక్కన సూర్యోదయం అయింది. ఒకపక్కన సూర్యాస్తమయం అవుతూవుంది.

ఇద్దరుసూర్యులు.

ఒకసూర్యుడు ఉదయిస్తున్నాడు: ఒకసూర్యుడు అస్తమిస్తు న్నాడు. ఉండివుండి ఆ ఇద్దరుసూర్యులూ ఒకరికి వొకరు ఎదురు బదురుగా నిలబడి మాట్లాడుకోవటం మొదలుపెట్టారు.

"నువ్వు పిరికివాడవు, పారిపోతున్నావు." అన్నాడు సూర్యోదయం.

"కాదు. నేను పోయినవస్తువుకోసం వెతుక్కుంటున్నాను" అన్నాడు సూర్యాస్తమయం.

"అది దొరకదని నీకు తెలుసు."

"దొరకనిదాన్ని వెతకటంలోనే వుంది విశిష్టత."

"సంఘాన్ని ఎదుర్కోటానికి భయపడి, నీ పిరికితనాన్ని కప్పిపుచ్చుకోటానికి ఒక సిద్ధాంతాన్ని సృష్టిస్తున్నావు."

అస్తమయం మాట్లాడలేదు· పడమటికొండల చాటుకి పరిగెత్తాడు. సూర్యోదయం తన వెలుగుని ఆకాశంఅంతా విరజిమ్మాడు. నల్లని ఆకాశం తెల్లబడింది· సూర్యోదయం తన వెలుగులోనే తాను లీనమయ్యాడు.

ఆ వెలుగులో తనకూతురు ఏడుస్తూవుంది. కొడుకు గిల గిల తన్నుకుంటున్నాడు కార్లు పరిగెత్తుతున్నాయి. జెండాలు ఎగురుతున్నాయి· జనం హడావడిగా తిరుగుతున్నారు. ఆ జనం మీదగా శాంత భయంతో తడబడుతూ, వొణికిపోతూ, బిత్తరి చూపులు చూస్తూ, కుచ్చెళ్లు పైకెత్తిపట్టుకొని పరిగెత్తుతూవుంది. అక్క ఆ పిల్ల రెక్కపట్టుకొని ఆపింది· "తొందరపడకే, మరదలే కర్తవ్యం బోధిస్తుంది." అంటున్నది·

ఏమిటా ధ్వని? ఏమిటది?

"ఇలా వొస్తారూ? ఒక్కసారి వొస్తారూ?"

ఎవరది? ఎవరాపిలిచేది? ఎవరిగొంతు అది? తన భార్య గొంతే? ఎక్కడ? ఎక్కడినుంచి?

"జీజీ? జీజీ?" అంటూ పక్కమీదనుంచి అదిరిపడిలేచాడు రాజారావు. గదిఅంతా కలయచూశాడు· వెలుతురు—చీకటి. చీకటి—వెలుతురు.

"జీజీ! ఎక్కడ జీజీ?

గది అంతా నిశ్శబ్దం. తోటలోనుంచి వీస్తున్న చల్లనిగాలీ, గుమ్మున కొడుతున్న పూలవాసనా తప్ప ఏమీలేదు

"జీజీ, నా జీజీ? ఎక్కడ?"

"ఇలా వొస్తారూ? ఒక్కసారి వొస్తారూ," ఆధ్వని వాకిలి వైపునుంచి వొచ్చినట్టు ఈసారి స్పష్టంగా తెలిసింది. అటు చూశాడు. గడపలో గంగాస్రవంతి అలలు పొంగుతున్నయి. కుటీరం గుమ్మానికి కొట్టుకుంటున్నయి. ఆ అలల్లోనుంచి తెల్లని పద్మం పుట్టుకొచ్చింది. ఆ పద్మానికి రెండు పక్కలా రెండు ఐరావతాలు మొలుచుకొచ్చినై. ఆ పద్మంలోంచి ఒకస్త్రీ ఆకారం బయటకు వొచ్చింది.

ఆమె తనభార్యే!

తనభార్య కనిపించగానే గంగాస్రవంతి అలలూ, పద్మం, ఐరావతాలు మాయంఅయినై.

గుమ్మంలో తనభార్య నిలబడి వుంది. ఫ్రేములో వున్న ఫొటోకిమల్లే వుంది. కళ్ళకు కాటుకపెట్టింది. చేతిగోళ్ళకు గోరింటాకు పెట్టింది. కనకాంబరంచీరె కట్టుకుంది. మొదటిరోజు ఎట్లా కనిపించిందో చెక్కు చెదరకుండా అట్లాగేవుంది. రాజారావు హృదయం సంతోషంతో ఉప్పొంగింది.

గుమ్మంవైపుకి అడుగులువేస్తూ, "జీజీ!" అన్నాడు. ఆ ఒక్కమాటలో, ఆమెసరసన తాను అనుభవించిన ఆనందం, విరహంలో తాను అనుభవించిన బాధా ఇమిడివున్నయి. "జీజీ"— ప్రపంచమే ఆ ఒక్కమాటలో ఇమిడివుంది.

ఆ పిలుపు ఆమె గుండెల్లోనుంచి దూసుకుపోయింది.

సూత్రంతెగిన గాలిపటానికి మల్లే తటతట కొట్టుకుంది. "జీజీ!" అంటూ చేతులుచాచి ముందుకు వొస్తున్నాడు రాజారావు. ఆమె ముక్కుమీద వేలువేసుకొని వారించింది. తన్ను అనుసరించ మని సంజ్ఞచేసి తోటలోకి నడిచింది. అతను అనుసరించాడు.

ఆమె నడక చూస్తుంటే అతని హృదయం దడదడ కొట్టుకుంది. భారంగా వొయ్యారంగా హంసనడిచినట్లు నడుస్తూవుంది.

ఆమె వెళ్ళివెళ్ళి పూలమొక్కలమధ్య నిలబడింది. అది ఆమెకు అమితఇష్టమైన ప్రదేశం. అక్కడ- ఆప్రదేశంలో- ఆ పూలమొక్కల మధ్య- ఆమె ఎన్ని వెన్నెలరాత్రుళ్ళుగడిపిందో! తియ్యటి కలలను, అంతకంటే తియ్యటి భావాలను ఎన్నిటిని కన్నదో- ఎన్నిటిని ఊహించుకుందో! ఆ ప్రదేశంలో ఆమె నిల బట్టం చూచేటప్పటికి రాజారావుమనస్సు వశంతప్పింది.

"జీజీ, నాజీజీ! వొచ్చావా? నీకోసం నిరీక్షించి నిరీక్షించి నాకళ్ళు కాయలు కాసినయి జీజీ! ఎన్నాళ్ళకు నా కనులపండుగ చేశావు! ఇన్నాళ్ళూ ఎక్కడున్నావు? నువ్వు లేకపోవటంవల్ల ఎంత బాధపడ్డా ననుకున్నావు! నామీద నీకు జాలి ఎట్లా లేక పోయింది జీజీ?"

వరప్రసాదంవల్ల మాటలు వొచ్చిన మూగవాడి సామెత అయింది అతనిపని. ఇన్నాళ్ళనుంచీ లోపల పేరుకున్న బాధ కట్లు తెంచుకొని బయటపడింది. ఆమె మాట్లాడలేదు. అశోక వృక్షాన్ని ఆనుకొని తలవాల్చి, దీనంగా చూస్తూ నుంచుంది.

ఆ చూపులు రాజారావు భరించలేకపోయాడు. "జీజీ ఎందుకు అలా చూస్తావు? ఎందుకు అలా బాధపడుతున్నావు? నేనేం తప్పుచేశాను? మాట్లాడు జీజీ. నీ మాటలకోసం,

నీమాటల అంచుల విరుపులకోసం నేను ఎంత తహతహ లాడ తానో నీకు తెలియదా? జీజీ. మాట్లాడు - ఒక్కమాట. పోనీ నీ పెదిమలు కదుల్చు - ఒక్కసారి."

అతని ఆవేశానికి మొక్కలన్నీ వూగినై. కన్నీరు కార్చినై. అశోకవృక్షం తల ఆడించింది. ప్రకృతే విలపించింది, ఆమె ఒక్క నిట్టూర్పు విడిచింది.

అతనికి మనస్సు ఆగలేదు. జీజీ ఎందుకు మాట్లాట్టం లేదో అర్థంకాలేదు—"నామీద కోపమా జీజీ?" అని జాలిగా అడిగాడు. "నేను నిన్ను మరచిపోలేదు జీజీ! మరచిపోలేను. ఒకప్పుడు నాకంటే నామాటలంటేనే మీకు ఎక్కువ ప్రేమ అన్నావు. మరొకప్పుడు పట్టుచీరె నలగదు అన్నావు. నీతో మాట్లాడిన మాటలు, నీతోకలిసి తిరిగిన రోజులు, స్థలాలు వేటినీ మరచిపోలేదు."

అతనిబాధ చూడలేక ముసలి గులాబీమొక్క ఊగి పోయింది. జొటజొట కన్నీరు కార్చింది. అతనిదగ్గరకు వొంగి, "ఎంత పిచ్చివాడవుబాబూ? అమ్మాయికి నీమీద కోపమా? నీతో మాట్లాడాలని ఎంత అభిలాషపడ్డది! నిన్ను పలకరించాలని ఎన్ని సార్లు ప్రయత్నించింది: నీదర్శనభాగ్యం లేక, నిన్ను విడిచివుండ లేక, అమ్మాయి ఎలాఅయిపోయిందో చూడు నాయనా? కాని ఏంచెయ్యగలదు?" అని అడిగింది.

రాజారావు తన భార్యని పరీక్షగా చూశాడు. కన్నీటితో కాటుక చెదిరింది. మొహం పాలిపోయివుంది. చాలా బల హీనంగా వుంది.

"జీజీ?" అన్నాడు.

ఆమె కన్నీరు బొలబొల కార్చింది. తల వొంచుకుంది. అతను చూచి. "కన్నీరు పెట్టుకుంటున్నావా జీజీ? ఊరుకో జీజీ. నువ్వు కన్నీరు పెట్టుకుంటే నేనుచూడలేను" అని కళ్ళు చేతుల్తో కప్పుకున్నాడు.

అమె తనకన్నీరు కొనగోటితో తుడుచుకుంది. ఒక కన్నీటిబిందువు చింది అతనిమీదపడింది. వొళ్ళంతా భగ్గునుంది. "జీజీ నా జీజీ" అని ఆక్రోశించాడు. ఆ ఆక్రోశంతో తోటఅంతా దద్దరిల్లింది.

"అమె కష్టం చూడలేక మీరింత బాధపడుతున్నారే! మరి మీరు నిద్రాహారాలు మాని బాధపడుతుంటే, ఆమె ఎంత కష్టపడుతూ వుందో మీరు ఎప్పుడైనా ఆలోచించారా? ఉన్నన్నాళ్ళూ మీకు సంతోషం ఆనందం ఇవ్వటమే తనజీవిత పరమావధిగా పెట్టుకుంది గదా! అటువంటి మనిషికి మీ రిట్లా యాతన పడుతుంటే విచారం కాక సంతోషం ఎట్లా వొస్తుంది? అని అడిగింది విరజాజిమొక్క.

"నువ్వు కష్టపడుతున్నావు. ఆమెని కష్టపెడుతున్నావు" అంది ముసలి గులాబీ మొక్క.

"పైగా ఇది అంతా ఆమెపేరు మీదగా ఆమెకోసం అని చేస్తున్నారు, మిమ్మల్ని కష్టపెట్టటానికేనా ఆమె వుపయోగపడవలసింది? మీదుఃఖానికి తాను కారణం అయ్యానని ఆమె ఎంత వేదన పడుతూవుందో చూడండి"? అంది విరజాజిమొక్క.

ఈ మాటలకు రాజారావు స్తంభించి పోయాడు. తన భావాలూ, తనప్రవర్తనా అన్నీ వొక్కసారి జ్ఞాపకం వొచ్చినై. చెట్టుకి ఆనుకొని నుంచున్న జీజీని. విచారంగా కన్నీరు కారుస్తూ

నుంచున్న జీజీని వెర్రిగాచూస్తూ, "నిజమా, జీజీ? నీ కన్నీటికి నేనే కారణమా?" అని అడిగాడు.

"నిజం, నిజం" అన్నవి తోటలోని పూలమొక్కలన్నీ-- ఐక్యకంఠంతో.

"ఇన్నాళ్ళూ నిన్ను బాధపెట్టానా జీజీ? నీస్మరణ, నిన్ను జ్ఞాపకం వుంచుకోటానికి నేనుప్రయత్నించటం, నీవులేవని బాధ పడటం. మనస్సంతా నీతోనే, నీజ్ఞాపకంలోనే నింపుకోవటం— అన్నీ నిన్ను బాధపెట్టటానికే ఉపకరించినయ్యా జీజీ?" అని అడిగాడు.

"అవును అవును" అన్నవి తోటలోని పూలమొక్క- లన్నీ-- ఐక్యకంఠంతో.

అతనికి తపనపుట్టింది. "మరి నన్నేం చెయ్యమంటావు? ఏంచెయ్యమంటావు? కర్తవ్యం బోధించు జీజీ?" అన్నాడు.

ఆమె మాట్లాడలేదు. పూలమొక్కలు మాట్లాడలేదు. కన కాంబరంమొక్క వొణికింది. గిజగిజ కొట్టుకుంది. అతని దగ్గరకు వొంగింది—"జీవించు" అంది. రహస్యం చెవులో వూదినట్టు చెప్పింది? "నీజీవితాన్ని ఆనందమయం చేసుకోటానికే ఆమెను జ్ఞాపకం వుంచుకో," అంది.

అతడు భార్యవంకకు చూశాడు. ఆమె మొఖంలో మార్పు వొచ్చింది. అంతకుముందున్న విచారం లేదు. నెమ్మదిగా. వెళ్ళి పోవటానికి గంగాస్రవంతి వైపుకి తిరిగింది.

"జీజీ. వెళ్తున్నావా! మళ్ళీనన్ను విడిచిపెట్టీ వెళ్తున్నావా? నన్ను విడిచిపెట్టకుజీజీ! వెళ్ళకుజీజీ!" ఆమె వినిపించుకోలేదు. గంగాస్రవంతివైపుకి నడుస్తూవుంది.

"జీజీ!" అని ఒక్క పెట్టున గుండెలు బద్దలయ్యేటట్టు అరిచాడు రాజారావు. ఆ అరుపుతో కూలబడ్డాడు. కొయ్యబారి పోయాడు.



పొద్దున్నే, నాన్న వొచ్చాడేమో చూచిరమ్మని శాంత పంపగా రాజారావుకూతురు తోటలోకి వచ్చి పూలమొక్కల మధ్య చలనంలేకుండా పడివున్న తండ్రిని చూసింది. భయపడి ఆవుర్న ఏడుస్తూవెళ్ళి అత్తకుచెప్పింది. ఆమాటకు ఇంటిల్లపాదీ ఒక్కసారి గొల్లుమన్నారు. ఇరుగు పొరుగు సహాయంతో, రాజారావుని తోటలోనుంచి ఇంటికి జేర్చారు.

## 11

రాజారావు బతుకుతాడని ఎవ్వరికీ ఆశలేదు. డాక్టరు కూడా ఇంచుమించు అలాగే చెప్పాడు.

పిల్లలగోల వినలేకపోయారు. కూతురు "నాన్నా.నాన్నా" అని ఒక్కటే ఏడుపు. అందర్లోకీ శాంత ఒక్కతే ధైర్యంగా వుంది. ఆమెమనస్సు రాయిచేసుకొని తిరిగింది. రోగికి కావలసిన సపర్యలన్నీ ఆమె చేస్తూవొచ్చింది. ఆమె ఓర్పుకీ నిగ్రహశక్తికీ అక్కకూడా ఆశ్చర్యపడ్డది.

వారంరోజులు గడిచినవి. స్పృహలేకుండా పడివున్న రాజారావుకి అంతా సందడిగా వుండేది. ఒకరోజు తన మంచంమీద ఒకపక్క జీజీ, ఒకపక్క శాంతా కూర్చునివున్నట్లు కనిపించింది. ఇద్దరూ తనవంకే చూస్తున్నారు. అంతలో జీజీ శాంతగా మారినట్లు కనిపించింది. ఇద్దరు శాంతలు కనిపించారు. అంతలో ఆ ఇద్దరూ ఒకరిలోఒకరు ఐక్యంఅయిపోయి ఒకశాంతే కనిపించింది. మర్నాడు డాక్టరు మంచంమీద కూర్చున్నట్టు అతనికి తెలిసింది. అతనూ అక్కా ఏదో మాట్లాడుకుంటున్నట్టుకూడా వినిపించింది.

మర్నాడు రాజారావు కన్ను తెరిచాడు. అప్పుడే ప్రపంచాన్ని చూస్తున్నవాడికిమల్లే అటూఇటూ చూశాడు. అక్క ఒక్కతే తనమంచంమీద కూర్చొనివుంది. తమ్ముడు కన్నుతెరవటం చూచి ఆమె అపరిమితానందంతో, "ఎట్లావుంది తమ్ముడూ?" అని అడిగింది.

"చాలా తేలిగ్గావుంది అక్కా," అన్నాడు రాజారావు. "అక్కా, నీమరదలు కనిపించింది. కనిపించి చెప్పింది. అంతా నువ్వుచెప్పినట్టే జరిగింది అక్కా" అన్నాడు.

"నాకుతెలియదట్రా తమ్ముడూ దానిగుణం? నువ్వు బాధపడుతూవుంటే చూస్తూ వూరుకునే గుణమా దాంది?" అంది అక్క ఆనందాశ్రువులు రాలుస్తూ.

రాజారావు ఒకచెంప అక్కతో మాట్లాడుతూ, ఒకచెంప చూపుల్తో గదిఅంతా వెతుకుతున్నాడు చివరికి ధైర్యం తెచ్చుకొని, "అక్కా, ఆ అమ్మాయి ఎక్కడుందీ?" అని అడిగాడు,

"ఏ అమ్మాయిరా, తమ్ముడూ?" అని అడిగింది అక్క.

"ఆ అమ్మాయి అక్కా....కిష్టుడిచెల్లెలు"

"శాంత అటరా....ఆ అమ్మాయి అనకపోతే శాంత అని చెప్పరాదూ! ఇప్పటిదాకా ఇక్కడేవుంది....పిల్లలకి నీళ్ళు పొయ్యటానికి వెళ్ళిందేమో!....తమ్ముడూ, నువ్వు మళ్ళీ మాలోకి వొచ్చావంటే అదిఅంతా దానిచలవేరా!....ఏమి సపర్య చేసిందిరా నీకు!.... కంటిలో వొత్తిపెట్టుకు కూర్చుందంటే నమ్ము" అంది.

రాజారావు సంతోషంగా కన్నుమూశాడు తనకోర్కె నెరవేరినట్టు అక్క చిరునవ్వు నవ్వుకుంది.



రాజారావు జబ్బు ఎంత అపాయకరంఅయింది అయినా, కోలుకోవటం మొదలుపెట్టింతరువాత, త్వరలోనే కోలుకున్నాడు. అమ్మమ్మ దీనికి కారణం తన సూర్యనమస్కారాలే అనుకుంది. అక్క తనమరదలే కారణం అనుకుంది. పిల్లలు మళ్ళీ యధాప్రకారం ఆటల్లోపడ్డారు. శాంత మనస్సుమాత్రం ఎవ్వరికీ తెలియటంలేదు.

జబ్బు నయం అయి కాలు కిందపెట్టగానే రాజారావు తోటలోకి వెళ్ళాడు. ఇదివరక్కిమల్లే కాకుండా తోట అతనికి చాలా ప్రశాంతంగా కనిపించింది. హృదయం నిర్మలంగా వుంది. వర్షం కురిసి వెలిసినట్టుంది. తోటలో కొంచెంసేపు అటూఇటూ తిరిగి గంగాస్రవంతిమీదగా వొస్తున్న చల్లనిగాలి అనుభవించి కుటీరంలోకి వెళ్ళాడు.

అతను వెళ్ళేటప్పటికి శాంత కుటీరంలోనే వుంది. ఆమె, మ సర్దకముందు కుటీరం ఎట్లావుందో అట్లా వుంచటానికి యత్నిస్తూవుంది. పుస్తకాలు యథాప్రకారం వుండేటట్టు విర ప్పెంది. కుంకంతో ప్లేటుమక్క జీజీఫొటోముందు పెట్టింది.

రాజారావు కుటీరంలోకి రావటం ఆమె చూచింది. ఆమె వరకుమల్లే సిగ్గుపడలేదు- భయపడలేదు.

అతన్ని చూచి, "మళ్ళీ మీ పుస్తకాలూ అన్నీ యథా స్థానంలో ఉంచాను," అంది.

"ఎందుకని శాంతా?" అని అతను ఆశ్చర్యంగా అడి గాడు.

అతను శాంతా అనేటప్పటికి ఆమెగుండె కొట్టుకోవటం మొదలుపెట్టింది. "మీకు అలావుంటమే ఇష్టం అనుకున్నాను." అంది.

"కాదుశాంతా, నీ ఇష్టంవొచ్చినట్లే వుంచు. ఇదుగో ఈ పుస్తకాలు ఇక్కడ ఉంచు—అందుకోటానికి వీలుగా వుం ంది. ఇదుగో జీజీ ఫొటో ఇక్కడపెట్టు—గదిలో ఎక్క డున్నా బాగా కనిపిస్తూవుంటుంది." కొంచంసేపు వుండి సాలో చనగా, "జీజీకి ఆ ఉన్నతస్థానమే బాగుంటుంది," అని కలిపాడు.

అతని వైఖరి చూచి శాంత ఆశ్చర్యపడింది. అతని ముఖ లక్షణాలు పరీక్షించి సిగ్గుపడింది.

ఇంతలో అక్క తన కొడుకునీ కోడల్నీ చెరొక రెక్కా పట్టుకొని, తీసుకొచ్చి, "చూడరా తమ్ముడూ. వీళ్ళపోట్లాటలు నేను దీర్చలేకుండా వున్నాను," అంది.

"చూడునాన్నా, బావ నన్ను ఎక్కిరిస్తున్నాడు" అ
కూతురు

"నన్ను ఎక్కిరిస్తేవూరుకుంటానా?" అన్నాడుకుర్రవా

"నాన్నా. పన్నుమీద పన్నువుంటే గొగ్గిపన్ను అనరూ?
అని అమాయకంగా అడిగింది పిల్ల.

"చట్టిముక్కు అయితే చొట్టముక్కు అనగూ?" అనిఅ
గాడు పిల్లవాడు.

అక్క చిరునవ్వునవ్వి , "ఒరేయ్ తమ్ముడూ, వీళ్ళప్ర
య కలహాలు నేను తీర్చలేకుండా వున్నారా. ఏదో మంచిగడియ
చూచి, ముడివేస్తేతప్ప మనం నిలిచే ఎత్తులేదు!" అంది.

అంతా నవ్వుకున్నారు. "ఏంమాటలుఅత్తయ్యా?" అంటు
కోడలు ఆమెవొళ్ళో ముఖం దాచుకుంది. అత్త వెళ్తూ, వెళ్తూ
"శాంతా, కిష్టుడు రేపు వొస్తానని ఉత్తరం రాశాడే," అ
చెప్పింది.


మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B107 |
| పుస్తకం పేరు | పరివర్తనం |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 93 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 61-64 |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | good |